# పొట్టి బావ

## హాస్య నాటికలు



సంకలనకర్త :
మద్దిపట్ల వెంకటరావు



ప్రచురణ :
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
బర్కత్‌పురా, హైదరాబాదు - 27

**POTTI BAAVA** (Humorous Playlets for Children)
*Compiled by :* MADDIPATLA VENKATA RAO

*Published by :* **Buddiga Subbarayan,**
Secretary, Andhra Pradesh Baalala Akademi, Hyderabad-27

*Editor :* **Yeditha Kameswara Rao**





ప్రచురణ నెం. **35**

వెల : రు. 6/-

ముఖచిత్రం : ఎమ్. కనకసూరిబాబు

చిత్రాలు : సురేంద్ర

ము ద్ర ణ :
పద్మా పవర్ ప్రెస్,
కుత్బిగూడ, హైదరాబాదు - 27

ప్ర తు ల కు :
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
బర్కత్‌పురా, హైదరాబాదు-500 027
ఫోన్ : 64701

# ముందుమాట

చిన్న పిల్లలకోసం నాటికలు వ్రాయడమంటే కత్తి మీద సామే! నాటికలు మరీ పెద్దవీ కాకూడదు, మరీ చిన్నవీ కాకూడదు. వినోదం కలిగించేవిగా వుండాలి, అయినా విజ్ఞానదాయకాలు కావాలి. క్లిష్ట సమాసాలు ఉండకూడదు. అయినా చక్కని భాషా సారస్వతాలు కలిగిఉండాలి. నాటికలో సంఘర్షణ వుండాలి, అయినా పిల్లలు ప్రదర్శించడానికి అనువుగా వుండాలి... ఈ విధంగా అటు రచనలోను, ఇటు ప్రదర్శనలోను పరస్పరం విరుద్ధంగా కనిపించే విషయాలను నేర్పుగా సమన్వయం చేసుకుంటూ సాగే పిల్లల నాటికలను వ్రాయడం అంటే కత్తిసాము కాదా? అందుకే బహుకొద్దిమంది మాత్రమే పిల్లల నాటికలను వ్రాస్తున్నారు. అందులో బహుకొద్ది నాటికలు మాత్రమే బాలప్రేక్షకుల మన్ననలు పొందుతున్నాయి.

పిల్లల కోసం పెద్దలు ప్రదర్శించేవి, పిల్లల కోసం పిల్లలే ప్రదర్శించేవి-అని పిల్లల నాటికలను స్థూలంగా రెండు రకాలుగా విభజించవచ్చు. రెండోరకం నాటికలను గురించే మనం ఇక్కడ చర్చించుకోవాలి.

పెళ్ళి పందిళ్లలో - పిల్లలు ఒకచోట చేరినప్పుడు - తాము ఇదివరకు చూచిన నాటక ఘట్టాలనో, తమను అలరించిన పాఠ్యగ్రంథాలలోని ఘట్టాలనో తిరిగి ప్రదర్శించాలన్న-తపన, పిల్లల నాటికలకు నాంది అని చెప్పవచ్చు. తల్లుల చీరెలు తెరలుగా, ఇంట్లోవాడే పౌడర్లు, తల్లిదండ్రుల దుస్తులు ఆహార్యంగా - నాటకాలు ఆడడంలో ఉండే తీయని అనుభవం అనుభవించిన వారికి మాత్రమే తెలుస్తుంది.

ఆంధ్రదేశంలో చిన్నపిల్లలని రంగస్థలం మీదికి తీసుకు వచ్చిన ఖ్యాతి బాలభారతీ సమాజం వారిది. అంతకు ముందే సురభివారు పిల్లలను చిన్నపిల్లల పాత్రలకు తీసుకున్నా - అన్ని పాత్రలను చిన్న పిల్లలచేతనే వేయించే పద్ధతిని బాలభారతీ సమాజం ప్రారంభించింది. రానురాను బాలనాటక సమాజాల సంఖ్య పెరిగి, వారిచేత వారి ఊహలకు అందని పెద్దపెద్ద నాటకాలను కూడా ప్రదర్శింపచేయడం ఆంధ్రదేశంలోని కొన్ని ప్రాంతాలలో అలవాటయిపోయింది. ఈ పద్ధతినే శ్రీ బళ్లారి రాఘవ తమ "దక్షిణ భారత రంగస్థలం" అన్న వ్యాసంలో సునిశితంగా విమర్శించారు. దీనిని "ధనార్జన కోసం తలపెట్టిన దోపిడి"గా వర్ణించారు ఆయన. దీనివల్ల ఒక విషయం స్పష్టం అవుతున్నది. పిల్లల చేత నాటికలు ప్రదర్శింప చేసేటప్పుడు వారి భావనా పరిధికి ఒదిగివుండే నాటికలనే ఎన్నుకోవాలి.

దాదాపు ఇదే సమయంలో ఉత్సాహవంతులైన ఉపాధ్యాయుల పర్యవేక్షణలో పాఠశాలల్లో నాటికలు ప్రదర్శించడం ప్రారంభమై, నాటకంలో ఉత్సాహంవున్న విద్యార్థులకు మంచి అవకాశం లభించింది. నిజానికి మొట్టమొదటి తెలుగు ఔత్సాహిక నాటక సమాజం వీరేశలింగంగారి 'వ్యవహార ధర్మబోధిని' ప్రదర్శించినప్పుడు అందులో

పాల్గొన్నవారు విద్యార్థులే! ప్రతి పాఠశాల వార్షికోత్సవాలకు ప్రదర్శింప చేసే నాటికా నాటకాలలో పాల్గొన్న విద్యార్థులెందరో తరువాత తరువాత ప్రముఖనటులైనారు.

దాదాపు ఇరవై సంవత్సరాలపాటు ప్రతి సంవత్సరం గుంటూరు జిల్లాలో మారుమూల వున్న మా పాఠశాలలో మా నాయనగారు శ్రీ మొదలి సుబ్రహ్మణ్యంగారి ఆధ్వర్యంలో వారు వ్రాసినవో, ఇతరులు వ్రాసినవో నాటికలను ప్రదర్శించడం నా స్వానుభవం. మారుమూల పల్లెటూళ్లలోనే నాటకాలంటే ఇంత ఆసక్తివుంటే, ఇక పట్ట ణాల విషయంచెప్పాలా?

ఆ తరువాత 1947లో మద్రాసులో ఆంధ్రబాలానంద సంఘం ప్రారంభించ బడి పిల్లల నాటకాలకు ఒక ఒరవడి, దానిని బట్టి స్థాయి లభించాయని చెప్పవచ్చు. దానితోపాటు "బాలానందం" కార్యక్రమాలు రేడియోలో ప్రారంభింపబడడంతో ఒక సమీకృతమైన కృషికి చక్కని అవకాశం లభించింది. దానికి తోడు నాటకాలంటే అభి నివేశంవున్న న్యాయపతి రాఘురావు, కామేశ్వరిగార్లకు పిల్లలలోవున్న ఈ సృజనాత్మ కతను క్రమ మార్గంలో నిర్దేశించే అవకాశం కలగడం - ఈ అన్ని కారణాలవల్ల కొద్ది రోజుల్లోనే బాలానంద సంఘం నాటికలకు, అవి నిర్వహించే బాలానందం నాటికలకు ఆంధ్రదేశంలో ఆదరం లభించింది.

అలాగే విజయవాడలో పిల్లల కార్యక్రమాలు నిర్వహించడంలో అందరి మన్ననలు పొందిన ఏడిద కామేశ్వరరావుగారి బాలభారతి కూడా పిల్లల నాటికలను అటు రేడియోలోను, ఇటు రంగస్థలం మీద ప్రదర్శించడంలోనూ ఎంతో పేరు ప్రఖ్యా తులు పొందింది. నావంటి వాళ్లెందరమో "బాలభారతి" సభ్యులం. కామేశ్వరరావు అన్నయ్యగారి దగ్గరనుంచి నాటక పాఠాలు నేర్చుకున్నాం.

ఇప్పుడిప్పుడే బాలల కార్యక్రమాల నిర్వాహణకు పట్టణాలలో ఆయా ప్రాంతా లలో కొన్ని సంఘాలు ఏర్పడి నాటిక ప్రదర్శనలను ఇవ్వడానికి పిల్లలను ప్రోత్స హిస్తున్నాము. నవీన బాలానందం సంఘం వంటి సంస్థలు మనకు ప్రతిఊరా వెలిసిన ప్పుడే పిల్లలలో నివురు గప్పివున్న సృజనాత్మకత వెలికివచ్చే అవకాశం వుంటుంది.

ఇందరి శ్రమతో ఇప్పుడిప్పుడే పిల్లల నాటికలకు కొంత ఆదరణ, గౌరవం ఏర్పడుతున్నాయి. "చిన్న పిల్లలకి నాటకాలెందుకు?" అన్న తేలికతనం నుంచి "చిన్న పిల్లల నాటికలు ఎలావుండాలి?" అన్న ఆలోచనలోకి పెద్దల లోకం ఇప్పు డిప్పుడే ఎదుగుతోంది. ఈ తరుణంలో కొన్ని ప్రాథమికమైన విషయాలను గురించి చర్చించుకొని నిర్ణయాలు తీసుకోవలసిన బాధ్యత నాటక రచయితలమీద, ప్రదర్శకుల మీద కూడా వుంది. అందులో మొదటి అంశం పిల్లల నాటికల్లో ఉండదగిన కథావస్తు వును గురించి. "బాలనాటికల్లో కథావస్తువు సముచితంగా వుందో లేదో నిర్ణయించడం ఎలా? నిర్ణయించేదెవరు? వినోద విజ్ఞానాలలో దేనికెంత ప్రాముఖ్యం ఇవ్వాలి?" అన్నవి ఆలోచించవలసిన విషయాలు. రెండవది పిల్లల ప్రదర్శనలను గురించి ఏదో ఆషామా షీగా, రంగులుపూసుకొని రంగస్థలంమీదకు వచ్చి వారివారి సంభాషణలు చదివి వెళ్ళి

పోవడమే ప్రదర్శనా? లేక పిల్లలకు రంగస్థల శాస్త్రాన్ని నేర్పాలా? నేర్పితే–ఎంతవరకు నేర్పాలి? – ఇలా ఎన్నో ప్రశ్నలకి కొన్నింటికైనా సమాధానాలు వెతుక్కోవలసిన అవసరం ఇప్పుడెంతైనా ఉంది.

పిల్లల నాటికలకు కథావస్తువు ఎటువంటిదై వుండాలి – అన్నది జటిలమైన ప్రశ్న. నైతిక విలువల బోధన పెద్దల ఆశయం అయితే – నాటిక కేవలం వినోదాత్మకమే అయితే బావుండునని పిల్లల ఆశ. రెంటినీ సమంగా మేళవించే నాటికలు రావాలి. అవి సుబోధకంగా వుండాలి. సాహిత్యపు విలువలువున్నా, పిల్లల ఆలోచనా పరిధిని దాటిపోకుండా ఉండాలి. ఇన్ని అర్హతలున్న నాటికలు రావాలంటే – పిల్లలతో సన్నిహితంగావుంటూ, వారి మనోగతభావాలను క్షుణ్ణంగా అర్థం చేసుకోగలిగినవారే ఇటువంటి నాటికలు వ్రాయడానికి పూనుకోవాలి. సమకాలీన సమస్యలను దిఙ్మాత్రంగానయినా పరిచయం చేసే నాటికలు వ్రాయబడాలి అంతమాత్రాన సాంప్రదాయికమైన కథావస్తువును పూర్తిగా విడనాడకూడదు. ఉదాహరణకు – పంచతంత్రంలోని కథల నాటకీకరణలు – ప్రదర్శనలో ఎంతో రక్తి కట్టడానికి అవకాశం వుంది. అందులో వినోదం వుంది. జంతువుల, పక్షుల వేషాలలో పిల్లలు కనిపించడానికి ఇష్టపడతారు.

కనుక వారికి అటువంటి నాటికలలోవేసే ఉత్సాహం ఉంటుంది ఇక నైతిక బోధనకు అటువంటి గ్రంథాలు ప్రామాణికాలే. ఇతివృత్తానికి ఎంత ప్రాముఖ్యం ఇస్తామో, వాడే భాషకు కూడా అంత ప్రాముఖ్యతను ఇవ్వాలి. తరువాత రోజుల్లో పిల్లలకు సాహిత్యం మీద అభిరుచి కలిగే విధంగా వుండాలి, మనం స్వీకరించే నాటికల కథావస్తువు, దానిని మలచడానికి ఉపయోగించే పలుకు బడులు.

పిల్లల నాటికలు ఇంతవరకు తాత్కాలికంగా కట్టబడిన ఆరుబయలు రంగస్థలాల్లో, కాంతి ప్రసరణం సరిగాలేని వేదికలమీద ప్రదర్శింపబడుతూ వచ్చాయి. వారికి నటనను గురించి అవగాహన చేసుకొనే విధంగా కావలసిన శిక్షణ ఇవ్వాలని ఆలోచించిన వారే ఇంతవరకు లేరు. పిల్లలలోని భావుకతను పెంపొందించి, వారిలోని సృజనాత్మక శక్తికి దోహదం కలిగించాలంటే నాటక ప్రదర్శనకు అవసరమైన కొన్ని అంశాలను వారికి బోధించడం ఎంతైనా అవసరం.

ప్రదర్శనకు అనువైన మంచి పిల్లల నాటికలను ఒకచోట చేర్చి ఒక సంకలనంగా కూర్చడం ఎంత కష్టమో ఈ సంకలనం చూస్తే అర్థం అవుతున్నది. ఇందులోని నాటికలు పాతకొత్తల కలయిక. ప్రఖ్యాత బాల నాటికల రచయితలు – శ్రీ న్యాయపతి రాఘవరావు, శ్రీ ఏడిద కామేశ్వరరావుగార్ల నాటికలు ఇందులో ఉన్నాయి. రాఘవరావుగారి నాటిక తెలుగు జీవితంలోని ఒక హాస్య ఘట్టాన్ని పొట్టిబావ, చిట్టి మరదళ్ల హాస్యం ద్వారా ప్రస్ఫుటం చేస్తే, కామేశ్వరరావుగారు తెలుగు జాతీయాల ద్వారా, పలుకుబళ్ళ ద్వారా వ్యక్తంచేశారు. మద్దిపట్ల వెంకట్రావుగారి "గాలిపటం" ఆంగ్లనాటకానుసరణమే అయినా, జీవితం గాలిపటం వంటిదన్న చేదు సత్యాన్ని వెలువరించే చక్కని నాటిక. శ్రీ సదానంద వ్రాసిన "కోతిమంత్రం" నాటిక

దొరికినదానితోనే సంతృప్తిపడాలి, అందని వాటికి అర్రులు చాచకూడదన్న నీతిని బోధిస్తుంది.

శ్రీ కొర్రపాటి వారి "పరీక్ష చదువులు", శ్రీరమణమూర్తి గారి "చక్కని రాజమార్గము" ఈనాటి పిల్లల చదువులనే ఒకే సమస్యను రెండుకోణాల నుంచి చూపుతాయి. ఒకదానిలో ఉపాధ్యాయుల బాధ్యతను చాటిచెప్పితే, మరోటి చదువుకోవడమన్న చక్కని రాజమార్గం ఉండగా, పెడదోవల వెంట పోయే విద్యార్థులను గురించి వ్యంగ్యంగా చిత్రిస్తుంది. శ్రీ 'అనపర్తి' గారి "చేత వెన్నముద్ద" అందరూ ఆడపిల్లలే పాత్రలుగా ఉన్న నాటిక.

శ్రీమతి కోడూరి లీలావతిగారి "అల్లరి బాజా", చెరుకుమల్లి భాస్కరరావు గారి "వచ్చిన వారి కళ్లు చేరడేసి" నాటికల్లో సంభాషణలు అతిత్వరితగతిని నడుస్తూ, కథను ముందుకు తీసుకొనిపోతాయి. ఇందులో చాలా నాటికలు రంగస్థలంమీద, రేడియోలో ప్రదర్శింపబడ్డవే ! ఇందులో కొందరు రచయితలు స్వీకరించిన సంఘటనలు ఎంతవరకు పిల్లల భావ పరిధిలో ఇముడుతాయో చెప్పడం కష్టం.

ఇందులో ఉన్న నాటికలన్నీ సమకాలీన రచయితలు వ్రాసినవే ! ఇలాకాక 1920 ప్రాంతం నుంచి కూడా తెలుగులో వచ్చిన అసలు సిసలైన బాలనాటికలను ఏరికూర్చే బృహత్ప్రయత్నాన్ని కూడా బాలల అకాడమీ చేపట్టవలసివుంది.

కష్టసాధ్యం అయిన సంకలన కార్యాన్ని చేపట్టిన శ్రీ వెంకట్రావుగారిని, కొన్ని నాటికలను ఒకచోట చేర్చి నలుగురికీ అందుబాటులో ఉండే విధంగా కూర్చే కార్యక్రమాన్ని చేపట్టిన బాలల అకాడమీని అభినందిస్తున్నాను.

ప్రొఫెసర్ మొదలి నాగభూషణశర్మ
అధ్యక్షులు,
నాటక శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం

# మనవి

హాస్యం అమృతం లాంటిది. పాలు చిలికితే అమృతం – అంటే వెన్న వచ్చినట్లు, మాటల విన్యాసం హాస్యాన్ని దొర్లిస్తుంది.

హాస్యం నవరసాలలో నాజూకైనది. దానిని ప్రయోగించే వివిధావస్థలలో – అది నవ్విస్తుంది, కవ్విస్తుంది, నొవ్వజేస్తుంది. నవ్వనవ్వగా – నొవ్వనొవ్వగా – అది అందరినీ అలరిస్తుంది – హాస్యం నవ్వించడానికే కాదు. శరీర ఆరోగ్యానికి కూడా మంచి చిట్కా అంటారు పెద్దలు !

హాస్యానికి అనేక ఛాయలు ఉన్నాయి. మనస్సును పులకలెత్తించే హాస్యమూ ఉంది; కలకపెట్టించే హాస్యమూ ఉంది. చక్కగా చక్కిలిగింతలు పెట్టినట్లు నవ్వించే సరళమైన హాస్యమే సరసమైన హాస్యం అంటారు. మోటు హాస్యం మొరటుతనానికి లక్షణం. అందుకే, హాస్యం అందరికీ ఆమోదయోగ్యంగాను, ఆనందపరిచేదిగాను ఉండాలంటారు. సభ్యత సంస్కారము కలిగి సర్వులను మెప్పించేదిగా ఉంటే, అది పది కాలాలపాటు నిలిచి, అందరినీ సంతోషపరుస్తుందనేది నిజం !

హాస్యం ఒకపాటిది కాదు; అది ఒక కళ ! అది అందరికీ లభ్యంకాదు... నేర్పు తీర్పులున్న కొందరికే దాని ప్రయోగం సాధ్యమవుతుంది! వారి వారి అంతస్తును బట్టి వన్నెలీనుతుంది.

హాస్యం అంటే అందరికీ సరదాయె ! అందులోనూ పిల్లలు హాస్యమంటే ఉరకలు వేస్తారు. నవ్వుతూ, గెంతుతూ ఉండే పిల్లలకు హాస్యం తీయని తాయిలమే అవుతుంది. అందుకే వినోదంతోపాటు విజ్ఞానాన్ని, నైతిక విలువలను పిల్లలకు అందించడానికి – హాస్యాన్ని ఒక సాధనంగా ఉపయోగించుకుంటారు రచయితలు !

పిల్లలకు వినోదం కలిగించడానికి రంగస్థలంపై ప్రదర్శించి ఆనందించడానికి వీలు కలిగించే కొన్ని వ్యంగ్య వినోద నాటికలను చేర్చి ఈసంకలనంగా రూపొందించడం జరిగింది. వివిధ రచయితల రచనలను సేకరించి, సంకలనంగా కూర్చిన శ్రీమద్దిపట్ల వెంకటరావుగారికి ఈ సంకలనమును సమీక్షించి, ముందు మాటలు వ్రాసిన ప్రొఫెసర్ మొదలి నాగభూషణ శర్మగారికి, ముచ్చటైన చిత్రాలను రచించిఇచ్చిన శ్రీ సురేంద్రగారికి, ముఖచిత్ర చిత్రకారులు శ్రీ ఎం. కనకసూరిబాబు ముద్రణాదికములలో సహకరించిన శ్రీ డి. రామలింగంగారికి ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ కృతజ్ఞతలను తెలియజేస్తున్నది –

—ఏడిద కామేశ్వరరావు

ఇందులో

# పొట్టిబావ

(హాస్య నాటికలు)




పాత్రలు :

పొట్టిబావ
చిట్టి మరదలు
పోలీసు ఇన్‌స్పెక్టరు
పోలీసు
దొంగ
రెండవ మరదలు
డాక్టరు

## రంగం - 1

(పొట్టిబావ ఇల్లు)

**బావ :** (ప్రవేశించి) ఛీ ఛీ ఛీ ఛీ! ఈ మధ్య ఈ చిట్టి మరదళ్ళందరూ కలసి నన్ను అవమానిస్తున్నారు. ముఖ్యంగా మా చిట్టి మరదలు—ఇక దాని ముఖం చూడదలచుకోలేదు. ఎదురుగావస్తే ముఖం తిప్పేసుకుంటాను.

**మర :** (ప్రవేశించి) బావా!

**బావ :** వచ్చావూ? నీముఖం నాకు చూపించకు.

**మర :** నీ కొక సంతోషకరమైన వార్త తెచ్చాను బావా!

**బావ :** ఏమిటా సంతోషం?

మర : ఇదిగో ఈ పేపర్లో చూశావా ? మంచి ప్రకటన పడింది.

"కావలెను"

పోలీసు శాఖలో పనిచేయుటకు—ఉద్యోగి కావలెను.
చురుకైనవారికి, కురుచైనవారికీ మంచి అవకాశం"
"వెంటనే పోలీసు శాఖకు దరఖాస్తులు పంపునది."

'ఇదే ఛాన్సు బావా ! చురుకైనవారూ' కురుచైనవారు కావాలట. అంచేత నువ్వు సరిగ్గా సరిపోతావు బావా.

బావ : అయితే పోలీసుల్లో చేరమంటావా ? నాకు చురుకుతనం ఉందంటావా ?

మర : బోలెడు ఉంది. నువ్వు పోలీసులో చేరితే నువ్వు దేశసేవ చేయవచ్చు. బావా ! కొంటెగా ప్రవర్తించిన చిట్టి మరదళ్ళందరినీ జైలులో పెట్ట వచ్చు. దొంగ రవాణా వర్తకం చేసే వారిని ఖైదులో పెట్టవచ్చు.

బావ : అదెలాగ ?

మర : చెప్పనా? మన దేశంలో నల్లబజారులో సరుకులు దాచేస్తున్నారు. వాళ్ళని నువ్వు పట్టుకోవచ్చును. పోలీసు దుస్తులు ధరించకుండానే నువ్వు సి.ఐ.డి. ఉద్యోగం చేయవచ్చును. ఊఁ.... వెంటనే పోలీసు అధికారుల దగ్గరకి వెళ్ళు...............

బావ : సరే !........

# రంగం - 2

(పోలీసు స్టేషనులో)

(పోలీసు ఇనస్పెక్టరు కూర్చొనిఉండగా భయపడుతూ పొట్టిబావ ప్రవేశం.)

బావ : గుడ్‌మార్నింగ్ !

పోలీసు : కమిన్ ! హూ ఆర్ యు ?

బావ : నేనా అండి ! నేనూ నేనూ—నన్నూ........

పోలీసు : రండి. కూర్చోండి.

బావ : నో మేటర్ ! నో మేటర్ !

పోలీసు : నోమేటర్ ఏమిటయ్యా కూచోమంటుంటే !

బావ : చిత్తం.

పోలీసు : యువర్ నేమ్ ?

బావ : నాపేరాండి ! అది అడక్కండి.

పోలీసు : ఇక్కడి కెందుకు వచ్చావు ?

బావ : ఉ.... ! ఉద్యోగం కోసం—

పోలీసు : ఓ ! ఐ సీ నీకు గుండెలున్నాయా !

బావ : (చాతీ తడుముకొని) ఉన్నాయండి.

పోలీసు : అదికాదు. నీకు గుండెధైర్యం ఉందా ! అని

బావ : చిత్తం. ఉందండి.

పోలీసు : అయితే పోలీసులో ఉద్యోగం ఇవ్వాలంటే ముందుగా నీగుండె ధైర్యం పరీక్షించాలి. ఏయ్ 420..........

420 : జీహాఁ !

పోలీసు : వీరిని ఆ చీకటికొట్లోకి పంపించు........

420 : జీహాఁ !

బావ : పోలీసుగారు ! నాకు—నాకు—చీకటంటే పడదండి. ఇంకేదేనా........

పోలీసు : ఫరవాలేదు ! ఆ చీకటికొట్లో ఒక గజదొంగ ఉన్నాడు. ఆ దొంగ దగ్గరికి వెళ్ళి వాడి చేతులకున్న సంకెళ్ళు విప్పి, వాడిని ఇక్కడికి తీసుకురావాలి అంతే.

బావ : బాబోయ్ గజదొంగే? వాడు నాలాగే గజం ఎత్తు వుంటాడా !

పోలీసు : వాడి ఎత్తు 7 అడుగులు, వాడికి బారెడు మీసాలు మూరెడు గడ్డం, పారపళ్లు, ఎవరేనా దగ్గరికి వెళ్తే వాళ్లని కరిచేస్తాడు కూడాను.

బావ : అమ్మ బాబోయ్! కరిచేస్తాడా!

పోలీసు : ఇది నీ గుండె ధైర్యానికి పరీక్ష....ఊఁ ! ధైర్యంగా ఆ చీకటి గదిలోనికి వెళ్లి సదరు గజదొంగను ఇక్కడికి తీసుకొనిరా ? ఏయ్ 420, వీనిని చీకటి గదిలో పడెయ్. చూస్తావేం ?

420 : జీహాఁ....నడూ....

## రంగం-3

(చీకటి గది)

బావ : ఆరి భగవంతుడా ! అంతా చీకటి ! ఆ దొంగ ఎక్కడున్నాడో కదా ! ఆంజనేయ దండకం చదువుతాను. "శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం ప్రభాదివ్యకాయం...."

దొంగ : (గంభీరంగా) ఎవడవురా నువ్వు ? డింభకా! రా ! ఇలారా ! నీపని పట్టిస్తాను !

బావ : (వణకుతూ) గజదొంగగారూ ! నన్ను కరవకండేం ! నేను పోలీసు ఉద్యోగానికని కక్కుర్తిపడి ఇందుకు ఒప్పుకున్నాను. నేను నిరపరాధిని.

దొంగ : అయితే ఇలా రా!.... ఇటు నాదగ్గరికి రా ? ఈ మూలకి రా ! ఊ ! ....నీ దుస్తులు విప్పు....చీకటి, పరవాలేదులే ! ఊ....నా దుస్తులు నువ్వు వేసుకో....నా సంకెళ్లు విప్పు, అవి నువ్వు వేసుకో, ఈ చీకటి గదిలోనే నువ్వు పడిఉండు....నేను తప్పించుకుంటా ? హా హా హా హా థాంక్యు (దొంగ పారిపోతాడు)

బావ : ఆరి భగవంతుడా ! ఆఖరికి నా చేతికి బేడీలు వేయించావా ! ఇప్పుడు ఆ పోలీసుగాడు వస్తే నేనే దొంగననుకొని ఏమిటి చేస్తాడో !

(పద్యం) లావొక్కింతయు లేదు.

ధైర్యము విలోలంబయ్యె

ప్రాణముల్ ఠావుల్ తప్పె మూర్ఛవచ్చె శ్రమంబయ్యెడిన్ నీవే తప్ప....

420 : ఏయ్ ! ఈచీకటి గదిలో నువ్వు పద్యాలు చదువుతూ కూచున్నావా ? ఏడీ ఆ గజదొంగ ?

బావ : (ఏడుపు కంఠంతో) వాడు పారిపోయాడండీ ! నాచేతికి బేడీలు వేసి నా డ్రెస్ తొడుక్కొని పారిపోయాడు.

ఇన్స్పెక్టరు : ఫూల్, ఇడియట్ టిమిడ్ఫెలో ! గెట్ అవుట్ ! మా పోలీసు శాఖ ఎంతో కష్టపడి అవసర వస్తువులను అక్రమ రవాణా చేస్తున్న గజదొంగను పట్టుకుంటే నువ్వు....గెట్ అవుట్ ! నీకు ఉద్యోగం లేదూ. గిద్యోగం లేదూ! గెటవుట్ యూ ఫూల్, ఇడియట్, టిమెడ్ఫెలో గెటవుట్ !

(పొట్టి బావని తరిమేశారు, బుర్ర గోక్కుంటూ చిట్టి మరదలు దగ్గరికి వచ్చేశాడు.)

## రంగం-4

(చిట్టి మరదలు ఇల్లు)

మర : ఏం పొట్టిబావా! వచ్చేశావు !....నీకు ఉద్యోగం ఇవ్వలేదా ?

బావ : అదంతా చెప్తాగాని మరదలూ ! ఫూల్, ఇడియట్, టిమిడ్ఫెలో, గెటౌటు అంటే అర్థం ఏమిటి ?

మర : ఆదా సంగతి....అయితే తెలిసిపోయిందిలే ఏమిటి జరిగిందో....

బావ : మరదలూ! నాకు పోలీసు ఉద్యోగాలు సరిపోవు. కాస్త సరదాగా చిట్టిమరదళ్ల మధ్య తిరిగి కాలక్షేపంచేసే ఉద్యోగం దొరికితే బావుణ్ణు.

బోయ్ : పేపర్! పేపర్! (పేపరు అబ్బాయి గదిలోనికి పేపరు విసిరి పోతాడు)

మర : బావా! ఏది ఆ పేపరు కిందపడేసి వెళ్లిపోయాడు, తీసి ఇయ్యి.

బావ : ఇంద.

మర : ఇందులో చూస్తా. నీకూ, నీహోదాకూ, నీకోరికలకు సరిపోయే ఉద్యోగం వగైరాలు ఖాళీలు ఉన్నాయేమో! చూస్తా,
(పేపరు తిప్పి)

ఆఁ! ....వాన్టెడ్, కావలెను.

ఒక సరికొత్త పిల్లల రంగుల పత్రికను అమ్ముటకు జంట నగరములలో ఏజంటు కావలెను.

బావ : ఏజంటు అంటే!

మర : జంట్ కాని జంట్ ఏజంటు. ఆ పత్రికను ఇంటింటా అమ్మితే— నీకు కమీషన్ వస్తుంది బావా? ఆ పత్రిక ఏజన్సీ పుచ్చుకో!

బావ : నేను పత్రికలు అమ్మగలనా అని.

మర : నెల కొకరోజు పని బావా? తక్కిన 28 రోజులూ కూచోవచ్చును. ఒక్కొక్క పత్రికకి ఒక పావలా కమీషన్ వస్తుంది. కనీసం ఈ జంట నగరాలలో 4 వేల పత్రికలు అమ్మవచ్చును. అంటే నీకు వెయ్యి రూపాయలు కమీషన్ వస్తుంది. నెల కొక్క రోజు కష్టం, నెల కొక వెయ్యి లాభం.

బావ : అయితే ఏజన్సీకి రాయమంటావా ?

మర : భయపడకు బావా! మన బాలానందంలోనూ, మా చిట్టి మరదళ్ల సమాఖ్యలోనూ వెయ్యేసి మంది సభ్యులు వున్నారు. రెండువేల ప్రతులు అక్కడే చెల్లిపోతాయి. దరఖాస్తు పెట్టు బావా.

బావ : సరే, కాగితం, కలం ఇయ్యి, (దరఖాస్తు రాస్తాడు)
"మహారాజశ్రీ రాజ పూజ్యులయిన శ్రీశ్రీశ్రీశ్రీ........

మర : నీ మొహంలాగా ఉంది ఈ దరఖాస్తు. ఇది ఇళ్లల్లో రాసుకొనే బాపతు కాదు. కంపెనీ ఉత్తరాలు వేరేలాగ ఉంటాయి, రాయి.

బాక్సు నెంబరు 39 వారికి,

మీరు ప్రకటించిన ప్రకటనను చూచాను. మీ మాస పత్రికకు నేను ఏజంటుగా ఉండదలచాను. దయచేసి ఆ ఏజన్సీ నాకు ఇచ్చినచో నెలకు సుమారు 5000 కాపీలు అమ్మగలను.

ఇట్లు,
పొట్టిబావ
కేర్ ఆఫ్ చిట్టిమరదలు
బాలానందం వీధి, హైదరాబాదు.
పిన్ కోడ్ నెంబరు-500 027

వెళ్ళి పోస్ట్‌బాక్స్‌లో వెయ్యి బావా !

(బావ నిష్క్రమణ)

* * *

మర : బావా ! బావా ! నీకు పేపరు ఏజన్సీ ఉద్యోగం అయింది. ఇదిగో పత్రికల పార్శిలు కూడా వచ్చింది. (ఒక పేపరు పార్శిలు విప్పుతుంది)

బావ : ఏదీ ఏదీ....పత్రిక !

మర : నీ అదృష్టం పండిందనుకో

బావ : పత్రిక పేరు ?

మర : బలే పేరు పెట్టేరు బావా ! "మొట్టికాయ" అని....ఊ....ఇంక ఆలస్యం దేనికి ? వేడి వేడి పకోడీలలాగ ఈ పత్రికలు అమ్మవచ్చును. ఇదిగో చిట్టిమరదళ్ల అడ్రసులు. ఒక్కొక్క వీధికి వెళ్లి అమ్మవచ్చును. వేగం వెళ్లు బావా....

## రంగం-5

(పొట్టి బావ వీధిలో పత్రికలు అమ్ముతూ ప్రవేశిస్తాడు.)

బావ : ఇదే చిట్టిమరదళ్ల వీధి....పేపర్....పేపర్. (కేకలు వేస్తూ) సరికొత్త పేపరు పిల్లల పత్రిక రండీ ! కొనండీ !

—అదిగో ఆ అమ్మాయి ఇటు చూస్తోంది. అక్కడికి వెడతా ఏమండీ మరదలుగారూ....

2 మర : ఎవడవురా నువ్వు ? నన్ను మరదలూ అని పిలుస్తున్నావు.

బావ : ఈ....ఈ ఇంట్లో మరదలు పిల్ల మీరేకదండీ ?

2 మర : అవును ! అయితే.

బావ : ఆ అదికాదండీ ! మీకు మొట్టికాయ కావాలా అని అడగడానికి వచ్చాను.

2 మర : ఆ ఏమన్నావూ !

బావ : సరికొత్త మొట్టికాయ కావాలా అని.

2 మర : ఏయ్ ! అబ్బాయి ! నీకేం పొగరు ఎక్కిందా ఏమిటి ?
—ఏయ్ ప్యూన్. వీడెవడో రౌడీలాగ ఉన్నాడు. వీడిని అవతలకు గెంటెయ్ !

బావ : ఆ ఆ నేనేం చేశానండి. మొట్టికాయ కావాలా అని అడగడానికి వచ్చాను. అది సరికొత్త పిల్లల పత్రికండీ....

2 మర : నీ వేషాలు చాలించు, గెటౌట్ !

# రంగం - 6

చిట్టి : పొట్టి బావగారికి పత్రికల ఏజన్సీకూడా అశుభంగా పరిణమించింది. ఈ ఉద్యోగాలేవీ మా పొట్టిబావకి సరిపోవని నాకు ఏనాడో తెలుసు.

పేపర్ : పేపర్ (ఇంకో పేపరువాలా ఒక పేపరు ఇస్తాడు.)

చిట్టి : ఆ ! ఈ పేపర్లు చూస్తా. ఇంకా ఏమైనా ఉద్యోగాలు ఖాళీలున్నాయేమో ?

"కావలెను" డాక్టరు పి.ఎస్. వనజగారి ప్రసూతి గృహములో పని చేయుటకు ఒక పురుష కాంపౌండర్ కావలెను. జీతం నెలకు 800 రూపాయలు. ఉద్యోగంలో చేరదలచుకున్నవారు డాక్టర్ మిస్ వనజ, జంతు ప్రసూతి గృహము బంజరుదొడ్డి సందులో, హైదరాబాదు.

బావా ! బావా ! నీకు వెయ్యి రూపాయల జీతం ఉద్యోగం దొరుకు తుంది. వెంటనే బయలుదేరు.

బావ : అదేదో ప్రసూతి గృహం అంటున్నారు !

మర : ప్రసూతి పనులన్నీ ఆ లేడీ డాక్టరు చూసుకుంటారు గాని, మిగిలిన పనులన్నీ నువ్వు చేయాలి.

బావ : అంటే ?

మర : అంటే కడగడం గిడగడం, మందులు రాయడం ఇటువంటివి తేలిక పనులన్నీ నువ్వు చేయాలి.

బావ : అలాగే

# రంగం - 7

(రంగం డాక్టరుగారి ప్రసూతి గృహంలో)

బావ : నమస్తే డాక్టరుగారూ !

డాక్టరు : నమస్తే లోపలికి రండి. మీరేనా పురుష కాంపౌండర్ పనికి దరఖాస్తు పెట్టారు.

బావ : చిత్తం, నేనేనండి.

డాక్టరు: ఈ పూట మా జంతు వైద్యశాలలో రెండు కేసులు ఉన్నాయండి. వాటిని మీరు చూసుకోవాలి.

బావ: అయితే నేనేం చేయాలండి.

డాక్టరు: పెరట్లో గుర్రపుశాలలో ఒక పొట్టి గుర్రం ఉంది. దానికి పళ్లు సలుపు తున్నాయి. వాటిని ముందుగా మీరు మందు నీళ్లతో కడగాలి. మందు రాయాలి, పళ్లు తోమాలి.

బావ: ఛీ ఛీ నన్ను గుర్రానికి పళ్లు తోమమంటారాండి! ఆ పని మాత్రం నేను చేయలేను.

డాక్టరు: ఫరవాలేదండి! అది పొట్టి గుర్రమే. దాని పళ్లు మీకు అందుతాయి. ఇదిగో బ్రష్షు....ఇదిగో టూత్ పేస్టు, గుర్రం మార్కు టూత్‌పేస్టు.

బావ: సరే ఇవ్వండి....

(పొట్టి బావగారు జంతు వైద్యశాలలో గుర్రపు శాలకి గుర్రం పళ్లు తోమడానికి వెళ్ళారు.)

బావ: బాబోయ్, నావైపు పళ్లు ఇకిలించింది. సకిలిస్తోంది, కరుస్తుందేమో, క్షమించండి, డాక్టరు! ఈ పనిమాత్రం నాకు చేతకాదు.

డాక్టరు: పోనీండి, రెండవ కేసు గాడిదకేసు.

బావ: గాడిదా!

డాక్టరు: అవును పాపం! గాడిద వెనకకాలిలో చిన్న మేకు గుచ్చుకుంది. ఆ గాయానికి బ్యాండేజి కట్టాలి.

బావ: అమ్మ బాబోయ్, ఆ గాడిద తంతేనో!

డాక్టరు: ఏం ఫరవాలేదు, నేను పక్కనే చూస్తూ ఉంటానుగా. దానికి ఇంత మేత పడేస్తే అది తింటూ ఉంటుంది.

బావ: సరే! ఆ బ్యాండేజీ గుడ్డ ఇవ్వాలి....నాకు ఫస్ట్ ఎయిడ్‌కూడా వచ్చును.

డాక్టరు: అందుకే మీకు ఉద్యోగం ఇస్త....ఊ....వెళ్లండి.
(భయపడుతూ బావగారు వెళ్ళారు. బావగారిని చూడగానే ఎవరో బంధువుని చూచినట్లు సంతోషంతో గాడిద ఓండ్ర (గాడిద అరుపు)

డాక్టరు: చూశారా! మీరు వచ్చారని దానికి సంతోషం. వెళ్లండి. వెనక కుడికాలే ఆ డెక్క దగ్గర.

(సైడు కర్టెను దగ్గరికి వెళ్ళి)

బావ: హైరో బేటా హైరో పావం!! ఇక్కడంతా గాయానికి చీముపోసింది. ముందుగా దీనికి మందు రాయాలి. హైరో బేటా హైరో....అబ్బా! చచ్చాను. నా మూతి మీద తన్నిందది. (బాధతో) డాక్టరు గారూ! మీ ఉద్యోగానికి దణ్ణం, మీ జీతానికో దణ్ణం.

(పాపం గాడిదచేత తన్నులు తిని బావగారు తిన్నగా వాళ్ల ఊరికి వెళ్ళారు.)




పాత్రలు :

చలమయ్య
పంతులు
శేషమ్మ
దాసరి

ఆదొక మధ్య తరగతి గృహస్థు ఇల్లు. ఇంటావిడ శేషమ్మ బియ్యం బాగుచేసుకొంటూ ఉంటుంది.

దాసరి : (తంబురా మీటుకొంటూ)

ఇక్ష్వాకు కులతిలక ఇకనైనా పలుకవా ! రామచంద్రా
నీవు రక్షింపకున్నను రాక్షకు లెవరయ్యా ! రామచంద్రా !

శేషమ్మ : (బట్టలు పిండెలు చుట్టుతూ)—

ముష్టిలో ముష్టి వీరముష్టి అన్నట్లు - మా ముష్టిబతుకుల్లో నీ ముష్టి చెయ్యేమిటి ? వెళ్లవయ్యా, వెళ్లు, వెళ్లు........,

దాసరి : వెళ్లమన్నా వెళ్లక, చూరుపట్టుకు వేళ్ళాడాదని - వెళ్లమన్నా వెళ్లకుండా అట్టే ఉంటానా, తల్లీ ? మీరు వెళ్లమన్నా వెళ్లేవాణ్ణే ! వెళ్లవద్దన్నా వెళ్లేవాణ్ణే ! సీతారాముల పెళ్లి వస్తోంది కదా - అని వచ్చాను :

శేషమ్మ : ఆఁ వచ్చావులే-వచ్చావు ! సీతారాముల పెళ్ళొచ్చినా - సిరిగలావిడకు వాళ్ళొచ్చినా పట్ట వగ్గాలుండవంటారు ! ఏం లాభం ? మాకు వాళ్ళూలేదు - మా ఇంట పెళ్లీలేదు - వెళ్లుబాబూ - వెళ్లు....

దాసరి : ఆలా అనెయ్యకండమ్మా ! కల్యాణ మొచ్చినా - కక్కొచ్చినా ఆగదు ! ఇంతకూ కలవారు కలిసివస్తే, కల్యాణం కదా తల్లీ !

శేషమ్మ : ఆ....చెప్పొచ్చావులే ! నీ పెళ్లి పెడాకుల్లాగా ఉంది-నా పెళ్ళికివచ్చి కాగడా వెయ్యమన్నాడట, వెనకటికి ఒక పెద్ద మనిషి ! అలా ఉంది. నువ్వు చెప్పేది - ఇంట్లో పెళ్లికి ఇరుకు - ఊళ్ళో పెళ్లికి ఉరుకూను ! నీకు తెలియదల్లే ఉంది-మా ఇంటాయన వ్యవహారం ! వెళ్లయ్యా, వెళ్లు !

దాసరి : అంత కరుకు మాటలెందుకు తల్లీ ! నోటితో లేదనేది, చేతితో లేదనాలి గాని !

శేషమ్మ : నోరు లేదంటే-చెయ్యి ఉందంటుందా ? వెళ్లు వెళ్లు, చెయ్యి ఊరుకో లేదు....

దాసరి : నోటికో మాట - చేతికో మూట - అన్నారు కాదమ్మా ! కలవారికి కరుణ కలిగితే కావిళ్లు కదులుతాయని - సామెత ! అమ్మగారూ !

శేషమ్మ : ఆఁ....కలవారి కావిళ్లూ, కనకమ్మ వేవిళ్లూ - దొందుకు దొందూ దొందప్పు ! చాలుచాలు గానీ, నన్నాట్టే వాగించక వెళ్లవయ్యా, వెళ్లు !

దాసరి : అమ్మగారూ ! వసపిట్ట వాగితేనూ - కొసమట్ట కాగితేనూ - పంటలు పరవళ్లే-అంటారు. మీ మాటలు వొట్టి మాటలు కాదు తల్లీ ! అవి మణులు, మాణిక్యాలూను ! "ఇంతి మాటలు బువ్వంపు బంతులాట" - అన్నాడు కాదండీ - కవిచౌడప్ప-

శేషమ్మ : నాకేం తెలుస్తాయయ్యా, ఆ కవులు, కవిత్వాలూను ! ఎరుకలేని మాటలు పరకలేని పొలాలు - సమానం ! ఇక వెళ్లు బాబూ వెళ్లు- పనిలో ఉన్నానుగా !

చలమయ్య : అబ్బబ్బబ్బబ్బ....ప్రొద్దున్నే వచ్చిన ముష్టాడూ-ప్రొద్దుకూకి వచ్చిన చుట్టమూ పొమ్మన్నా పోరు - ఇదేం గోలే....ప్రొద్దున్నే పెట్టుకొన్నావు పోరు! ఏమిటయ్యా! దాసరయ్యా - ఏమిటి చెప్పు, నీ గొడవ?

దాసరి : అమ్మన్నా, అయ్యన్నా ఆశకదా బాబుగారూ! గుప్పెడు గింజలు....

చలమయ్య : అమ్మ లేదన్నా, అయ్య ఉందన్నా, రెండు ఒకటేనయ్యా! వెళ్లు బాబూ!

దాసరి : వెళ్లేవారిని వెళ్లమనేదీ లేదు - ఉండేవారిని ఉండమనేది లేదన్నాడుట - వెనుకటికి ఎవరో-వెడతాను బాబు వెడతాను....వెళ్లమన్నా, ఉండమన్నా - ఒకటే అర్థం మీ మాటలకు!

(తంబురా ధ్వని దూరమవుతుంది)

చలమయ్య : హమ్మయ్య-వెళ్లావుకదా - బిచ్చగాడికి వెచ్చం బాధ, చచ్చినాడికి సవారి బాధ తెలియవు - అంటారు - పోయాడుగాని - చూడు-మరీ....

శేషమ్మ : ఏమిటి చూచేది - కూతురు పెళ్లికి వెచ్చంలేదు - సీతారాముల పెళ్లికి బిచ్చంలేదు - సరా! ఏమిటీ చూడాలంటున్నారు?

చలమయ్య : రెడ్డొచ్చె మొదలాడమని - మళ్లీ మొదలెట్టావూ కూతురు పెళ్లో, పెళ్లో....అంటూను!

శేషమ్మ : తిట్టేనోరు - తిరిగేకాలు ఊరుకోదు - అంటారుగా - అందుకని తిరిగ్గా మొదలెట్టాను - సరా!

చలమయ్య : అంతే, అంతే-పనిలేని వాడు పిల్లి తలగొరిగాట్ట! అలాగ, ప్రొద్దున్నే మొదలెట్టావు....నీకేం-చెబుతావు కబుర్లు! అమ్మాయి, పెళ్లి - అని!

శేషమ్మ : అంటే అన్నానంటారు - ఉంటే ఉన్నానంటారు కాని - నా మాట మీకేమైనా తల కెక్కుతోందా? చెవిటివాని చెవిలో శంఖం ఊదినట్లు అవుతోంది గానీ....

చలమయ్య : అదీ, అలా అడుగు చెబుతాను - నేను నీ మాట ఎందుకు వినటం లేదో! పెళ్లాం మాటమీద నడిచేవాడు-కళ్లెం లేకుండా స్వారీ చేసేవాడు సమానమంటారు తెలిసిందా అది! ఇక ఏం వినమంటావు, నీ మాట?

**శేషమ్మ :** వింటే విన్నట్లు, కంటే కన్నట్లు-ఆపైన నా మీద వొట్టు సరేనా-ఇకనైనా వినండి! ఆ ఆరట్లవారి సంబంధం చూడండి - ఆలస్యం అమృతం విషం అన్నారని - అంటున్నాను ఇంత ఇదిగా, ఊ....

**చలమయ్య :** ఓహో! ఆదా! తలిచినప్పుడే తాతపెళ్లి-లా ఉంది నీ ధోరణి.

**శేషమ్మ :** తాతపెళ్లి కాదు - తనయ పెళ్లి - పిలిచి పిల్లనిస్తానంటే-కరిచి మీద పడ్డాట్ట! అలా ఉంది మీ వాలకం - నన్నంటారెందుకు?

**చలమయ్య :** అన్నానంటే అన్నానంటావుగాని - కులమెరిగి స్త్రీని, గోత్ర మెరిగి పురుషుణ్ణి తెచ్చుకోవాలంటారు - తెలుసా?

**శేషమ్మ :** అబ్బో తెస్తారు - తెస్తారండీ! ఉట్టి కెగరలేనమ్మ, స్వర్గానికి ఎగిరిందని, మీరు తేకేం - నాకు తెలియదూ, ఆ మాత్రం!

**చలమయ్య :** అలాగా-అయితే-వియ్యానికి, కయ్యానికి సమాన ఫాయా ఉండాలని అంటారు - ఆ విషయం తెలుసుకునే మాట్లాడుతున్నావా?

**శేషమ్మ :** అయితే మన స్థాయికి ఏం తక్కువ వచ్చిందీ-అనీ....అంగట్లో అన్నీ ఉన్నాయి, అల్లునీ నోట్లో శనీ-అనేది తప్ప....

**చలమయ్య :** మన స్థాయాయే చూచుకునీ పొంగి పోతున్నావా? అలా చెప్పు.... ఏదో....రాజుగారి భార్య మేడ ఎక్కితే మరోవాని భార్య పాక ఎక్కిందటలే....

**శేషమ్మ :** అంతే లెండి! మీరు అన్నిటికీ అలా తక్కువ వెల కట్టుకుంటారనీ నాకు తెలిసే అంటూ ఉంటాను....ఇంతకూ-మగాడు దిగాలుపడితే ఆడదానిమాట అరుపులక్రింద జమా....

**చలమయ్య :** ఇదిగో ఆ అరుపులూ వద్దు, విరుపులూ వద్దు - ఆ పెళ్లి చూపుల పెత్తనమేదో నువ్వే కానియ్....ఆడ పెత్తనం - తంబళ్ళదొరతనం-కానీ-అదేదో....

**శేషమ్మ :** నా చూపులూ, నా పెత్తనాలూ ఎందుకు పనికివస్తాయి? గుడ్డి కన్ను మూసినా ఒకటే తెరిచినా ఒకటే.

**పంతులు :** (ముక్కుపొడుం పీలుస్తు వస్తూ)

లొట్టకన్ను ఉంది చూచారు! లొట్టకన్ను కన్న గుడ్డికన్ను గుడ్డిలో మెల్ల అన్నారు. చూశారా శేషమ్మగారూ....మరీ....

**చలమయ్య :** ఆహా! వచ్చారా, పంతులుగారూ! వెదక బోయిన తీగ కాలికి తగిలిందన్నట్లు - సమయానికి చక్కా వచ్చారు రండి, రండి! లోపలికి....

**పంతులుగారు :** గుమ్మం దగ్గరకు వచ్చినవాణ్ణి గుమ్మం లోపలికి రాకుండా ఉంటానా? ఇంతకూ ఆలుమగళ్లు ఏమేమో అనుకొంటున్నట్లున్నారు (నవ్వి)- ఆలుమగళ్ల అలక, అద్దంమీద ఆవగింజ కులికినంతసేపు ఉండదు అంటారు. అందుకే ఇట్టే అతుక్కుపోతారు.

**శేషమ్మ :** ఏమతుక్కు పోవడమోలెండి పంతులుగారు! ఆదివారంనాడు అందలము సోమవారంనాడు జోలీని-అలా ఉంది మాదంతా....

**చలమయ్య :** ఆ....ఆ....అందరికీ ఆదివారము, మాకు సోమవారమూను - చూస్తున్నారుగా పంతులుగారూ!

**పంతులు :** సోమవారం వెడితే మంగళవారం రాకమానదు, చలమయ్యగారూ! సోమవారం సంధ్యలోనే మంగళవారం మలి ప్రొద్దు అన్నారుగా! అందుకే ఆ కాస్తమాట అనిపించేద్దామని చక్కావచ్చాను, ఆయ వారానికైనా వెళ్లకుండా! ఇంతకూ ఆ అరట్లవారి అబ్బాయి ఉన్నాడు చూశారూ పెళ్లికొడుకు పనసగింజ! పనసగింజ అంటే నమ్మండి!

**చలమయ్య :** ఆఁ పెళ్లికొడుకు పనసగింజ పెళ్లికొడుకు అక్కగారేమో పనస చెక్కనూ! విన్నానండి బాబూ, విన్నాను....

**శేషమ్మ :** చూశారా, చూశారా! పనసపండూ తెచ్చి పళ్లెములో పెడితే తినలేని అల్లుడు దిక్కు దిక్కులు చూశాడని ఈయనగారి మాటలు వింటున్నారా! అబ్బాయితో మనకు వియ్యంగాని, అబ్బాయి అక్కగారి గోల మనకెందుకు? చెప్పండి, పంతులుగారూ!

**చలమయ్య :** ఎందుకూ? అంటే పోతుందనుకుంటున్నావేమిటి? ఆడబడుచూ-అర్ధమొగుడూ, అనడం వినలేదా?

**పంతులు :** బాబుగారు, ఒక్కమాట! ఏమిలేని ఆకు ఎగిరెగిరిపడితే-అన్నీ ఉన్న ఆకు అణిగి మణిగి ఉంటుందని సామెత! అక్కగారు ఎలాంటిదైతే మనకెందుకు? అబ్బాయి మంచివాడు, అణకువ గలవాడు....

**శేషమ్మ :** బాగా చెప్పారు పంతులుగారు! వట్టి గొడ్డుకు అరుపు లెక్కువ అన్నట్లు ఆవిడగారి గోలతో మనకేం పని!

**చలమయ్య :** ఏం పని ఏం పని? అని తీసిపారేసి, అమ్మాయి పెళ్లి ఏదో అయిందనిపించేసి తరువాత వ్యవహారం వికటిస్తే ఏం చేస్తావు! చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకున్నాడని. ఏమీ చేయలేక-వాడి కాళ్లు వీడి కాళ్లు పట్టుకోమంటావా!

**శేషమ్మ :** పోనిద్దురూ ప్రతిదానికీ ఇలా మీనమేషాలు లెక్కవేసుకుంటూ కూర్చుంటే ఏ పనీకాదు! ఏది ఎలా జరుగవలసి ఉందో అలాగ

జరగక మానదు. సామ్యం చెప్పినట్లు రాగల శని రామేశ్వరం వెళ్ళినా తప్పదు.

పంతులు: అమ్మా ఊరికే చెప్పారా "నుదుటన్ వ్రాసిన వ్రాత తప్పునా నూరేళ్లు చింతించినన్" అని!

చలమయ్య: అది సరేనండీ, పంతులుగారు, 'బ్రహ్మ రాసిన రాత చెరగమన్నా చెరగదు.' అని ఊరుకుంటామంటండీ? అసలు ఆ రాత ఏమిటో కాస్త అటూ ఇటూగా - చదవగలిగినంతవరకూ చదవడానికి ప్రయత్నించ వద్దంటారా? చెప్పండి.

శేషమ్మ: ఇంతకూ-శివుడి ఆజ్ఞలేనిదే చీమైనా కుట్టదు - ఎందుకొచ్చిన అనుమానాలు? ఎందుకొచ్చిన భయాలూ - అంట! భువిలో పెళ్లిళ్లు దివిలో నిర్ణయమౌతాయట! కానీయండి.

పంతులు: నిజం నిజం....అసలు-ఘటన అనేది ఒకటి ఉంది చూడండి, అది తప్పదు! గంగలో పడ్డా గట్టుకుకొట్టుకు వస్తుంది. అది అయి తీరుతుంది దానిని ఎవ్వరూ ఆపలేరు. కానున్నది కాకమానదు, పోనున్నది పోకమానదు.

చలమయ్య: అది సరే-ఒక్కమాట చెప్పండి - క్షేత్ర మెరిగి విత్తనము పాత్రత ఎరిగి దానమూ చెయ్యాలి. కాదంటారా! ఔనంటారా చెప్పండి.

శేషమ్మ: మాటలు డొంకలు తిరిగితే చేతులు వంకర్లు తిరిగాయట! అలా మాటాడుతారేం? మీరేమన్నా సజావుగా ప్రవర్తించారా? చెప్పండి! నూట పదార్లు కట్నమిస్తాను. వెయ్యిన్నూట పదహార్లు నగలు పెట్టండి అని మగపెళ్లి వారిని అడగడం ఏమైనా బాగుందా అంట! కొన్నది వంకాయ, కొసరు అడిగినది గుమ్మడికాయానా? ఎక్కడేనా ఉందా?

చలమయ్య: ఇదిగో డొంక తిరుగుడు నీదా? నాదా? హుఁ! దున్నే రోజుల్లో దేశాలు తిరిగి, కోసే రోజుల్లో కొడవలి పట్టుకుంటే ఏంలాభం? అడగవలసిన సమయంలో అడక్కపోతే అమురుతాయా చెప్పండి? ముందు అన్నది మాట - మందు మాన్పినది తీట.

శేషమ్మ: ఎందుకొచ్చిన మాటలివీ? మాటలు కోటలు దాటుతాయి, కాలు గడప దాటదు. మీ విషయం నాకు తెలియదా? మూడు దశకాల ముచ్చట!

చలమయ్య: లేకపోతే కూర్చుని లేవలేవుగాని, వొంగుని తీర్థ మెడతావు కాబోలు!

పంతులు: అయ్యా చలమయ్యగారు! అమ్మా, శేషమ్మగారు! కొంచెం ఆగండి, మరి కొంచెం నిదానించండి అని మనవిచేస్తున్నాను. కాలు జారితే

తీసుకోవచ్చునుగాని, నోరు జారితే తీసుకోలేము-మాట అంటే మాట విలువ ఉండాలి - అంటారు కదా !

చలమయ్య : బాగా చెప్పారు - కుంటి కులాసం, ఇంటికి మోసం అన్నట్లుగా ఉంది ఈవిడగారి ధోరణి - నేనేదో అంటే ఏదేదో అన్నానంటారు !

పంతులు : చింతలేని ఆవులింత పుట్టదు, (ఆవులించి) ఇంతకూ పెళ్లికొడుకువారు ఒప్పుకొన్నారు కనుక, నేనింతగా అంటున్నానుగాని, చూశారూ, కందకు లేని దురద కత్తిపీటకా అన్నట్లు మధ్యను నా కెందుకు చెప్పండి.

చలమయ్య : ఇంతకూ కానున్నది కాకమానదు.

శేషమ్మ : అలా అంటూ కూర్చోండి. ఆ కాగల పనిని గంధర్వులే తీరుస్తారు.

చలమయ్య : అదుగో వినండి. వినండి ఆవిడగారి మాటలు ! మొగుణ్ణి కొట్టి మొగసాల కెక్కిందని....

శేషమ్మ : అనండి అనండి ఇంకా అనండి మొగుడు కొడితే, మధూకరిపువాడూ కొట్టాడని....(అంటూ ఏడుపు మొదలు పెడుతుంది)

పంతులు : ఎబ్బెబ్బే....అమ్మా ....మీరలా కంట తడిపెట్టకూడదు - 'కలకంఠి కన్నీరు' అన్నట్లుగా.

చలమయ్య : బాగా చెప్పారు - నేనిప్పు డేమన్నానని ఆవిడ అఘాయిత్యము, ఓఘాయిత్యమూను ! ఎవరో అన్నట్లు "మొగుడు కొట్టినందుకు కాదుగాని తోడికోడలు నవ్వినందుకు" అన్నట్లు ఈమె వ్యవహారం, చివరకు ఇలా....

శేషమ్మ : అంతే లేండి బురదలో బెడ్డవేస్తే మొహమంతా చిందింది అన్నట్లుగా మిమ్మల్ని నేనేదో అన్నానని....అన్నందుకు, అన్నంత పనీ అయ్యింది ! చాలు ! చాలు-నా కేంలెండి ఎలా జరిగేది అలా జరుగు తుంది ! అన్నానో, అనిపించుకొంటున్నానో !

పంతులు : వద్దు వద్దని గెంటినా, కద్దుకద్దు అని మీద పడింది అన్నట్లుగా- ఈ సంబంధం ఎలాగూ కలిసివచ్చేదే ! మనకంటే ఆవలివైపువారే తొందరపడుతున్నారు- చూశారూ-కాళ్లకు చుట్టుకొన్న పాము కరవక మానదు.

శేషమ్మ : అలా చెప్పండి పంతులుగారూ - కార్తెకు ముందు ఉరిమినా, కార్యం ముందు వదలినా చెడుతుంది అని సామెత ! అవతలివారి వద్దనుండి ఆ కాస్త మాటా అనిపించుకొనే దాకా ఊరుకోండి బాబూ అన్నాను-

అంతే కదా నేనన్నది? అందుకు ఇంత అర్భాటమా? కురవని మబ్బులకు ఉరుము లెక్కువ అన్నట్లు,

చలమయ్య: నువ్వా! నువ్వులేవూ-వొట్టి గొడ్డుకు అరుపు లెక్కువ-అన్నట్లుగా! చూడండి పంతులుగారూ-ఆడది మాట్లాడి-మగాడు మాట్లాడక చెడి పోయారని సామెత! అందుకని నేను మాట్లాడుతూ ఉంటే.

శేషమ్మ: ఎందుకొచ్చిన మాటలండీ ఇవి! అవ్వకు నోరురేగినా - గువ్వకు కుత్తుక రేగినా పట్టపగ్గాలుండవు-అన్నట్లు-ఈ వయసులో ఈ ధోరణి ఏమిటండీ! ఇంట ఉన్న పెళ్లాంమీద ఒంటికాలిపై లేచాడని నేనేగా లోకువ?

చలమయ్య: అలాగాండీ-తమరు మాత్రం తక్కువ తిన్నారా? నల్లేరుపై బండి-నల్లేరుపై బండి నడిచినట్లుగా నామీద స్వారీచేయటంలేదూ?

పంతులు: దానికేం లెద్దురూ - ఆలిమీద అతను రేగినా అతనిమీద ఆలి రేగినా పాలల్లో నీళ్లు, నీళ్లల్లో పాలూను! ఇట్టే కలిసిపోతారు. కలిసి పోయినట్లు కూడా కనిపించదు. ఇంతకూ ఈ ఆలూమగళ్ల మాటలు ఎలా ఉంటాయంటే అదిగో పులి అంటే, ఇదిగో తోక! ఆ గుప్పిడి మూసి వున్నంతసేపే, తెరుస్తే ఏమీ ఉండదు-అంతే!

చలమయ్య: అదిగాదండీ-అందితే జుట్టు, లేకపోతే కాళ్లాను-ఈవిడ ధోరణీ....

శేషమ్మ: అంతేలెండి! నేననేమాట మీ కలానే ఉంటుంది-ఏమీ తోచకపోతే నన్ను పిలిచి, గిల్లికజ్జా పెట్టుకొనడమేగా! తోచీ తోచనమ్మ తోడి కోడలు పుట్టింటికి వెడితే, అదీ తోచనమ్మ ఆడబడుచు అత్తారింటికి వెళ్లిందట! అలాగా-తోచక అలా అంటూ ఉండండి పడతాను!

పంతులు: అమ్మా! ఒక్క మాట వినండి-పడ్డవారు చెడ్డవారు కాదు-సరా!

చలమయ్య: పంతులుగారూ! ఆమె ఏదో అన్నదని-దానిపై నేనేదో అన్నాననేగా ఇందాకట్నించీ రభస అంతానూ! అసలు రహస్యం తెలిసికూడా ఆమె అలా అంటూ వుంటే ఎలా చెప్పండి - ఎద్దులేని సేద్యం - చద్దిలేని పయనం-అన్నట్లు-డబ్బులేని పెళ్లి ఎలా సాగుతుందండి?

పంతులు: అంతేబాబూ అంతే! పైసాలేనివాడు పరభోగ వర్జితుడూ!

శేషమ్మ: అయ్యో, చెప్పండి, ఎక్కువవెల గుడ్డను, తక్కువవెల గొడ్డునూ కొనకూడదంటారు కదా! డబ్బులేదని-ఏ వీధిలో పోయేవాడికో పిల్లను కట్టబెడితే, ఎలాగండీ!

పంతులు: పాలేరుకు గొడ్డుపోయినా, మారుతల్లికి బిడ్డ పోయినా ఒకటే అన్నట్లు-అది ఎవరో, ఎవరో, చెప్పుకోవలసిన మాటగాని, మీలాంటి

వారు అనుకోవలసిన మాటకాదు - ఆయన కూడా పెళ్లి విషయం ఆలాచూస్తూనే వుంటారు మీరు అంతగా చెప్పాలా? మంచివాని కొకమాట, మంచిగొడ్డుకు ఒకదెబ్బ - చాలుకదా!

శేషమ్మ: ఎంతచెప్పినా వినిపించుకోరుకదా! చెప్పిచెప్పి నా నోరుపడిపోతుంది! 'చెప్పి చెప్పి నాకు బంగారు చెప్పులు చేయించు' 'అన్నధోరణిలో ఆయన! పోనీ మీలాంటివారిని పిలిచి చెప్పుకొని, చెప్పించుకొందామా అంటే! మంది ఎక్కువైతే, మజ్జిగ పలచన అవుతుందన్నట్లు - ఆ ఆరట్లవారి సంబంధం విషయం నలుగురి నోళ్లల్లోనూ పడి, చివరకు ఎవరో తన్నుకు పోతారేమోనని భయం.... ఏం చెప్పమంటారు - నా బెంగ! మనసులో గుద్దులాట! ముసుగులో సద్దులాటాను.

చలమయ్య: మరేం భయ పడకండమ్మా! అవతలివారు ఎంత అట్టహాసం చేసినా ఎక్కడికి పోతారు? నాకు తెలియదూ? మేకలు ఎంత బలిసినా తోకలు బెత్తెడేనని.

శేషమ్మ: ఔననుకోండి! అయినా కొంచెం తొందరపడడం మంచిదని- నే నెంత ఇదైతే మాత్రం ఏం జరుగుతోంది! లంకమేత గోదావరి ఈతకు సరి - అన్నట్లు నామాట - ఆయన తిరుగుడూ ఒక్క రకంగానే ఉన్నాయి. దొందూ దొందూ దొందప్పు!

పంతులు: సత్రం భోజనం మఠం నిద్ర - గా ఆయన తిరుగుతున్నారు. నే నెరుగుదును.

శేషమ్మ: ఎందుకొచ్చిన తిరగడం! ఇంతకూ పుణ్యంకొద్దీ పురుషుడు - దానం కొద్దీ బిడ్డలూను - మేమింతే పెట్టి పుట్టామేమో అనిపిస్తూ ఉంటుంది....

చలమయ్య: అదిగో, అదిగో అప్రయోజకత్వానికి అహంకారమెక్కువని - మళ్లీ మాటలు ఒదిలేస్తున్నావు.... సుమీ!

శేషమ్మ: ఔనౌను.... పెట్టి పోషించలేని పతికి పరవళ్లెక్కువ కాదూ మరి-

పంతులు: అయ్యో, అయ్యో! చదువుకోని వాని సరసం మదుపు లేనివాని విరసం సమానం- అంతేగాని- ఇద్దరికి ఇద్దరుగా- మీరే ఇలాగ....

శేషమ్మ: ఆ! చదువు కొన్నవాని కంచె చాకలిమేలు! ఏం లాభం? ఆ సంబంధమేమో ఒప్పుకొని రండీ అంటే చంకను బిడ్డను పెట్టుకొని

ఊరంతా వెదికిన ఇల్లాలి లాగ ఏమో సంబంధాలు, ఎక్కడెక్కడో తిరగడ మేమిటి చెప్పండి ! ఇంతకూ తల్లిని కనుక నాబాధ.

**పంతులు :** ఔనండోయ్ - తల్లిచేసిన మేలు - ఉల్లిచేసిన మేలు సమానం ! ఈ తల్లి చెప్పేమాటలు మంచివి అయి తీరుతాయి - తప్పదు.

**చలమయ్య :** ఏమిటండీ ఆ మేలు ! పెళ్లిచేసి చూడు ఇల్లుకట్టి చూడు - అని సామెత ! ఈవిడ ఇల్లుకట్టిన మొహమైతేగా, పెళ్లిచేసి చూడడానికి !

**శేషమ్మ :** పోనిద్దురూ.... ఏదో చెప్పుకున్నాను పెళ్లికాని పిల్లను చూచి తల్లిపడే బాధ !

**చలమయ్య :** నేనూ చెప్పుకుంటాను పెళ్లయిన కొడుకును చూచి తండ్రిపడే బాధ.

**పంతులు :** రెండూ సమానమూ అంటారు - అంతేనా ? ఇంకా ఏమైనా అనమంటారా ?

**చలమయ్య :** ఏమనమంటారు - నాపిల్లకు పెళ్లే చెయ్యను - మూడేముక్కలు !

**శేషమ్మ :** చెడ్డకాపురానికి ముప్పేమిటి ! చంద్రకాంతాలు ఒండవే పెళ్లామా - అన్నట్టు !

**పంతులు :** సరికిసరి - బేసికి బేసి, సున్నకు సున్న హళ్లికిహళ్లి - అనవలసిన మాట అనేశారు - కనుక - ఇక ఎవరికి వారే - యమునా తీరే పదండి పోదాం - ఎవరి దారిని వాళ్లం—

**దాసరి :** (తంబురా మీటుకుంటూ)

విఘ్నేను పెళ్లికీ, వేయి విఘ్నాలు—
వచ్చిపడ్డాయండి ! వచ్చిపడ్డాయీ !
వెళ్లొద్దురాబాబు ! వెళ్లొద్దురా !!



# చక్కని రాజమార్గం....

— డి.వి.రమణమూర్తి

పాత్రలు :

సీతాపతి : ఆ ఇంటి యజమాని } వయస్సు
జానకమ్మ : సీతాపతి భార్య } 40, 35 సం॥వాళ్లు

వాణి
కృష్ణ } పిల్లలు – 12 లేక 13 సం॥ వయస్సుగల వాళ్లు
మధు

కుర్రాడు : 14 సం॥ వయస్సు

**స్థలం : సీతాపతిగారిల్లు. ఆ ఇంటి అలంకరణ మధ్యతరగతి జీవితాన్ని తెలుపుతుంది.**

**సమయం : ఉదయం ఆరుగంటలుపైన.**

(తెర తొలగే సరికి రంగస్థలానికి మధ్యగా ఒక నవారు మంచం ఉంటుంది. దానిమీద ముసుగు కప్పుకుని జానకమ్మ నిద్రపోతుంది. ముఖం ప్రేక్షకులకు కనపడేలా పడుకుంటుంది. నుదుటిమీద పెద్ద గుండ్రని బొట్టుఉం. టుంది. చక్కని నేత చీర కట్టుకునిఉంటుంది. గురక పెడుతూ ఉంటుంది. ఆ మంచంకోడు దగ్గర, జానకమ్మ కాలు దగ్గర, క్రిందను "వాణి" 12 సం॥ వయస్సు గల చురుకైన పిల్ల శ్రద్ధగా ఒక తెలుగు పద్యం కంఠస్థం చేస్తూ ఉంటుంది. ఆ గొంతును మించిన జానకమ్మ గురక శబ్దం వినిపిస్తుంది. "వాణి" చదవడం ఆపి గురక విని, మళ్లీ అంతకంటె గట్టిగా చదువుతుంది. ఆ సరికి సీతాపతి 45 సం॥పైబడ్డ మనిషి వస్తాడు. చేతుల బనియను, పంచ, భుజం మీద ఒక చేనేత తువ్వాలు అతని వేషధారణ. వాణి చదువు ఆపింది. జానకమ్మ గురక ఘోరంగా వినిపిస్తుంది.)

సీతా : దీని నిద్ర బంగారంగానూ ! అది గురకా లేక సముద్రపు హోరా ? (ఆమెను తట్టి లేపుతూ) ఓయ్! అవతారం ! (గట్టిగా) ఓయ్? (వాణి గొంతు తగ్గించి చదువుకుంటూ ఉంటుంది)

జాన : (బద్ధకంగా, నిద్రమత్తులో) ఆఁ ! (కళ్లు తెరవకుండానే)

సీతా : నిద్రలేవవోయ్ !

జాన : అబ్బా! ఏమిటండీ! (విసుగ్గా)కాస్సేపు నిద్రపోనివ్వరుకదా(గురక - నిద్ర)

సీతా : ఒసేవ్ ! నీగురక విని ప్రజలు జడుసుకుంటున్నారే (తట్టిలేపుతాడు)

జాన : (కళ్లుమూసుకునే) అంతేకదా.

సీతా : నీముఖం. ఆరుకొట్టి అరగంట దాటిందే (కోపంగా) ఇంకా నిద్రేమిటే అంట్లముఖందానా !

జాన : (కళ్లువిప్పి ఆవులించి, విసుగ్గా) మీతో మహచెడ్డ చావొచ్చి పడిందికదా. మీరు కంటినిండా నిద్రపోరు.... మమ్మల్ని కాస్తంత కమ్మగా కునుకు తీయనివ్వరు. (లేచి, మంగళసూత్రం కళ్లకద్దుకుంటుంది) ఆఁ! ఏమిటట? మీసోదె.

సీతా : పెద్దవాళ్ళం మనమే బారెడు పొద్దెక్కిందాకా మంచం దిగకపోతే, పిల్లలు ఎప్పుడు లేస్తారూ.... పాఠాలు ఎప్పుడు చదువుకుంటారూ (అని మంచం మీద కూర్చుంటాడు)

జాన : (కొంచెం జరిగి) అదుగో వాణీ చదువుకుంటోందిగా.

సీతా : అది సరే. మిగతా బడుద్ధాయిలో.... ?

జాన : వాళ్ళే చదువుకుంటారు లెద్దురూ పరీక్షలింకా చాలా దూరం ఉన్నాయటగా.

సీతా : (వ్యంగ్యంగా) ఓహో అదాసంగతి, ఇప్పుడు పూర్తిగా నిద్రపోయి అప్పుడు నిద్రమాని చదివేసి ఉద్ధరిస్తారన్నమాట. వట్టిసోమరులు ఆడపిల్లకున్నపాటి శ్రద్ధ వీళ్ళకు లేదు.

జాన : దానికి ఒకంతట చదివిన చదువు ఒంటపట్టదంటగా. అందుచేత అది ఇప్పటి నుండి రోజూ చదువుకుంటేగాని లాభం లేదట.

సీతా : ఓహో! అలా అని ఏడిశారా నీదగ్గర. అక్కడికి వీళ్ళేదో ఏకసంథగ్రాహి ల్లాగ. ఊఁ! ఊఁ.! ఆ కిష్టిగాణ్ణి, మధును లేపు, లేచి చదువుకుంటారు.

జాన : పోన్లెద్దురూ ఈ వేళ ఆదివారంగా. కాస్సేపు కమ్మగా నిద్రపోనివ్వండి రేపు చదువుకుంటారు లెద్దురూ.

సీతా : (బాధగా) ఇదెక్కడి ఖర్మే, నీతోపాటూ చదువుకోవల్సిన పిల్లల్ని కూడా నిద్ర పొమ్మంటావేమిటే నిద్రభంగీ, పోనీ నువ్వన్నట్టు ఈ వేళ ఆది వారం శలవేగా, మరి ఈ పూట భోజనానికి శలవు ఇచ్చేయరాదూ!

జాన : (ఆవులిస్తూ మళ్ళీ మంచం మీద పడుకోబోతుంది) ఏదో ఒకటి చేద్దాం గాని....

సీతా : (ఆమెను పడుకోనీయకుండా ఆపుతాడు)

జాన : కాస్సేపు పడుకోనిద్దురూ! (పడుకుంటుంది)

సీతా : (కోపంగా, గట్టిగా) ఒసే అవతారం. లేచి కాసిన్ని కాఫీనీళ్ళు తగలెడతావా లేదా?

వాణీ : (చదువు ఆపి)రండి నాన్నా! నేను కాఫీ కాచిస్తాను. అమ్మను పడుకోనీండి.

జాన : (కళ్లుమూసుకునే) నా బంగారు తల్లివే, ఆ పని చేసిపెడుదూ. ఈలోగా నేనొక చిన్న నిద్ర తీసేస్తాను,

సీతా : సిగ్గులేక పోతేసరి. చదువుకుంటున్న పిల్లను డిస్టర్బు చేస్తుంది. లే, లే, వాణీ! నువ్వెళ్ళి మధు అన్నయ్యను, కృష్ణబావనూ లేపవే. లేచి చదువు కుంటారు.

వాణీ : అమ్మబాబోయ్! నేను వాళ్ళను లేపడమే!

సీతా : ఏం?

వాణీ : నేను అస్తమానం చదువుకుంటున్నానంట. అందుకని మీరు వాళ్ళని అస్తమానం చీవాట్లు వేస్తున్నారంట. అందుకని వాళ్ళు నన్ను తిడుతు న్నారు నాన్నా.

సీతా : ఏడిశారు గాడిదలు, (జానకమ్మ గురక విని ఆగి అటు చూసి) చూడు వాణి మీ అమ్మ నిద్ర. ఓయ్! ఓయ్! నిన్నే (తట్టిలేపుతాడు)

జాన : (కళ్లు విప్పకుండానే) కాఫీత్రాగేశారా (కంగారుగా)

సీతా : కాఫీలేదూ! నాశ్రాద్ధమూలేదూ!

జాన : పోనీ నే పెడతాలెండి

సీతా : ఏమిటి నాశ్రాద్ధమా!

జాన : కాదు కాఫీ !

సీతా : చూడూ ! నువ్వు నిద్రపోతే పోయేవుగాని కాస్తంత ఆ గురక ఆపవే. మా బుర్రలు పని చేయడం లేదూ.

జాన : (ఆవులిస్తూ) అలాగే (నిద్రలోకి జారుకుంటుంది)

వాణి : నేను కాఫీ పెడతానుగాని, మీరు వాళ్ళను లేపండి నాన్నా (ఎడమవైపు లోపలికి వెళ్తుంది)

సీతా : సరే నమ్మా ! (లోపలికి వెళ్తాడు)

(తెర)

## రంగం - 2

(రంగాలంకరణలో మార్పులేదు. వెనుక మంచం ఉంటుంది. రంగస్థలానికి మధ్యగా వివిధ భంగిమల్లో వాణి, మధు, కృష్ణ కూర్చుని చదువుకుంటూ ఉంటారు. వాణి తత్వం, సౌమ్యం. మధుకి స్వంత ఆలోచన తక్కువ. ఎదుటివాడి తెలివితేటల మీద ఆధారపడతాడు. కృష్ణకి అతితెలివి, వక్రబుద్ధి, చొరవ ఎక్కువ.)

వాణి : (ప్రార్థన పూర్వకముగా) ఒరే ఒరే మధు అన్నయ్యా ! ఈ లెక్క కొంచెం చెప్పవురా !

మధు : నేచెప్పనుపో పిలక్కి తాడు కట్టుకొని చదువుతావుగా ఆ మాత్రం అర్థం కాదేమిటమ్మా !

వాణి : ఈ లెక్క కొంచెం చిక్కుగా ఉందిరా ప్లీజ్ కొంచెం చెప్పరా !

మధు : (కృష్ణ వంకచూస్తాడు)

కృష్ణ : (వద్దని సంజ్ఞచేస్తాడు)

మధు : ఊహూ ! నే చెప్పను.

వాణి : పోనీ కృష్ణబావా ! నువ్వయినా చెప్పవూ.

కృష్ణ : చెప్తాను. కాని చిన్న షరతు.

వాణి : షరతా ! ఏమిటి ?

కృష్ణ : మేం చదువుకోమన్నప్పుడే చదువుకోవాలి. వద్దన్నప్పుడు మానేయాలి అలా ఒప్పుకుంటేనే చెప్తాం.

వాణీ : అదెలా బావా ! నాకు వీలున్నప్పుడు రోజూ చదువుకోవడం తప్పా ?

కృష్ణ : తప్పా ! తప్పున్నరా ! నీకు బుర్రలేదు. అంచేత నువ్వు రోజూ పప్పు రుబ్బినట్లు

మధు : ఇడ్లీపిండి రుబ్బినట్లు....

కృష్ణ : పుస్తకాలు రుబ్బేస్తావు. నీలాగా మేం రుబ్బడం లేదని, మామయ్య మమ్మల్ని పట్టుకుని రుబ్బేస్తున్నాడు.

వాణీ : మీరూ రోజూ చదువుకోకూడదూ. ఎవరొద్దన్నారు ?

మధు : మాకు నీలాగ బుర్రలేకపోతేకదూ రోజూ చదువుకోడానికి, నువ్వు సంవత్సరం అంతా చదివిన చదువు మేం నెలరోజుల్లో పూర్తి చేసేస్తాం ఏరా!

కృష్ణ : (సగర్వంగా) అవును నేనది కూడా చేయనక్కర్లేదు. పరీక్షల ముందు రెండు రోజులు రాత్రుళ్లు కొంచెం అలా వీధిలోకి వెళ్తేచాలును - క్వశ్చన్ పేపర్లే తీసుకొచ్చేస్తాను !

వాణీ : అది మీధైర్యం.

మధు : అందుచేత చిట్టిచెల్లెలా : అనవసరంగా రోజూ చదువుకుని ఆరోగ్యంపాడు చేసుకోకు. నిశ్చింతగా నిద్రపో. రేపు పరీక్ష అనగా క్వశ్చన్ పేపర్లు తెచ్చిస్తాం - ఫస్టుక్లాసు తెచ్చుకో.

సీతా : (దూరంగా దగ్గు వినిపిస్తుంది) వాణీ, ఎక్కడున్నావమ్మా !

కృష్ణ : ఒరే మధూ ! మామయ్య వస్తున్నాడురా !

(మధు ఇంగ్లీషు పాఠాలు, కృష్ణ తెలుగు పద్యం గడగడా చదివేస్తుంటారు వాణి చదువు ఆపి, అకస్మాత్తుగా చదివేస్తున్న ఇద్దరి వంకా చూస్తుంది)

సీతా : (వచ్చి) ఆపండిరా !

మ : కృ : (విననట్టు ఇంతా గడగడా చదివేస్తూఉంటారు)

సీతా : (ఇంకా గట్టిగా) ఆపండిరా బుద్ధిమంతుల్లారా !

మ : కృ : (అకస్మాత్తుగా ఆపేస్తారు, తుఫాను ఆగిపోయినంత నిశ్శబ్దంగా ఉంటుంది)

కృష్ణ : (అమాయకంగా ముఖంపెట్టి) ఏం మామయ్యా ! చదువుకుంటుంటే ఆపమన్నావ్.

సీతా : బుద్ధిలేక. కదూ ! నాదగ్గు వినగానే మీకు ఎక్కడలేని శ్రద్ధా చదువుమీద అమాంతంగా పుట్టుకొచ్చేసింది కదూ ! విన్నానురా.

మధు : విన్నావా నాన్నా !

సీతా : ఆఁ! అంతా విన్నానురా ఒరే మేనల్లుడా ! కృష్ణా ! సుపుత్రా ! మధూ ! ఇటు వినండి

కృష్ణ ! ఏంటీ మామయ్యా !

సీతా : తాచెడ్డకోతి వనమంతా చెరచిందనీ, మీరు చదువుకోకపోతే పోయె బుద్ధిగా చదువుకుంటున్న వాణీని చెడగొట్టకండిరా. మహాప్రభువుల్లారా ! మీకు చదువు అబ్బకపోతే ఏ కాఫీ హోటల్‌లోనైనా బల్లలు తుడిచైనా బ్రతుకుతారు - చిప్పలు కడిగైనా కాలక్షేపం చేయగలరు. అర్థమైందా !

మ : కృ : ఆఁ! ఆఁ!

సీతా : ఏమర్థమైంది?

కృష్ణ : చదువులేకపోతే బల్లలు తుడిచైనా బ్రతుకుతాం.

మధు : (వెంటనే అందుకుని) చిప్పలు కడిగైనా కాలక్షేపం చేయగలం.

సీతా : కాని, అది ఆడపిల్లరా. అదలా బ్రతకలేదు. అక్షర జ్ఞానం లేకపోతే దానికి పెళ్ళికూడా అవదురా. కాబట్టి మీరు దానికి హిత బోధలు మానేయండిరా అడ్డగాడిదల్లారా! మీకెలాగూ బాగుపడే యోగం ఉన్నట్టులేదు. దానినైనా బాగుపడనీయండిరా.

జాన : (వస్తూ) మీరా ! బయట ఏదో మీటింగులో ఉపన్యాసం అనుకుంటున్నాను. ఏం జరిగిందట ! అంత గట్టిగా మాట్లాడుతున్నారు.

సీతా : ఒక మహాప్రళయం, ఒక భూకంపం, ఒక ప్రపంచయుద్ధం జరిగిపోయేయి.

జాన : సర్లెండి మీకెప్పుడూ వేళాకోళమే. అసలు సంగతేమిటటా !

సీతా : నీ సుపుత్రుడూ, మేనల్లుడూ కలసి పరీక్షల్లో వచ్చే ప్రశ్నలు, పరీక్ష ముందురోజు తెచ్చిస్తారంట - అందుకోసం రోజూ చదువుకోనక్కర్లేదని వాణికి హితబోధ చేస్తున్నారు.

జాన : మంచిదేగా. కాస్తంత ఇంట్లో పని పాట్లకు తోడుగా ఉంటుంది. ఇంట్లో ఆడపిల్లున్నదన్నమాటేగాని, ఒక్కర్తైనా అన్ని పనులూ చేసుకోలేక

చస్తున్నాను. మీరేమో చదువుకుంటున్న పిల్లలకు పనులు పురమాయించ కూడదంటారు.

సీతా : అవునూ !

జాన : అదేమో చదువుమిష పెట్టి బొత్తిగా ఇంటిపనులు చేయడంలేదు.

సీతా : ఏడిశావు. నోరుమూయి, ఒరే చవటాయిలూ ! మీ పిచ్చిపిచ్చి ప్లానులు కట్టిపెట్టి, ఏరోజు విన్నపాఠం ఆ రోజు చదువుకొని బుద్ధిగా పాసవ్వండి. పరీక్షలకింకా చాలా టైం ఉంది. వినపడుతుందా !

మ : కృ : ఓ ! అలాగే (తలలూపుతారు)

జాన : వాళ్ళు బుద్ధిమంతులండీ, చూశారా! గంగిగోవుల్లా తల ఎలాఊపుతున్నారో.

సీతా : (వ్యంగ్యంగా) నువ్వెంత తెలివైనదానవో వాళ్ళంత బుద్ధిమంతులులే. వాళ్ళు గంగిగోవులు కాదే. జిత్తులమారి నక్కలు. తెలుసునా.

మధు : మీకెందుకు నాన్నా. నేను పరీక్ష పాసవ్వడమే కదా కావాలి.

కృష్ణ : అంతేకదా మామయ్యా !

సీతా : అంతే. అంతే. కాని అడ్డదార్లుతొక్కికాదు. దాని వలన పరీక్షలు పాసై పోతారేమోగాని, మీబుర్రల్లో చదువంటూ ఏమీ ఉండదు. ఆ చదువుకు పునాదీ ఉండదురా ! అయినా నాకు తెలియకడుగుతాను. సంవత్సరం పొడుగునా చదవకుండా అకస్మాతుగా ఎలాపాసైపోతారో కాస్తంత శెల విస్తార్రా !

మధు : ఏముంది నాన్నా! ఒక్క నెలముందు తెల్లార్లూకూర్చొని చదివేస్తేచాలదూ.

సీతా : ఓహో ! మరీ నెల్లాళ్ళూ వేళకు నిద్రలేక, ఆరోగ్యం పాడైపోయి సరిగ్గా పరీక్షల ముందే వొంటికి ఏదైనా రోగం వస్తేనో....

కృష్ణ : ఎందుకొస్తుందీ ! మాకేం రోగంరాదు.

సీతా : రాదని గ్యారంటీ ఏమిటి ? అమృతం త్రాగారా ?

జాన : అదేమిటండీ ! శుభమా అంటూ వాళ్ళు పరీక్షలు అవలీలగా పాసైపోతా మంటుంటే, "మీకు రోగమొస్తేనో, మీరు మంచంపడితేనో" అంటూ అశుభం పలుకుతారేంటండీ !

సీతా : నా బుద్ధిగడ్డితినీ ! ఊఁ! చెప్పండిరా ! ఏరోగం రాదని గ్యారంటీ ఏమిటి ?

మ : కృ : (తడబడుతూ) రాదు. అంతే. అదంతే.

సీతా : అహఁ! వస్తే ఏం చేస్తారూ అని!

మ : కృ : ఏం చేస్తాం?

సీతా : ఏం చేస్తారో నేచెప్తా వినండి, అప్పుడు పరీక్షల్లో మీరు మంచం ఎక్కి, పరీక్షను చెట్టెక్కిస్తారు, మరో సంవత్సరం ఇదేక్లాసులో ఉండి. అవే పాఠాలకు పునాది దిట్టపరుస్తారు. మీ జీవితంలో అతి విలువైన కాలాన్ని ఒక సంవత్సరాన్ని వృధాగా పోగొట్టుకుంటారు. అంతేనా! మాట్లాడరేం.

జాన : పసివాళ్ళను పట్టుకొని పంచాయితి పెట్టేస్తున్నారు. వాళ్ళేం మాట్లాడతా రండీ!

సీతా : నువ్వుకాస్సేపూ మాట్లాడకు! ఒరే మేనల్లుడా! కృష్ణ పరమాత్మా! తమ భవిష్యత్ ప్లాను ఏమిటో విన్నవిస్తారా!

కృష్ణ : ఏముంది మామయ్యా! వెరీసింపుల్, పరీక్ష ముందురోజు అర్ధరాత్రి ఒక్క సారలా మెయిన్ రోడ్డు మీదున్న ఇరానీ హోటల్ దగ్గరికి ఒక్క ట్రిప్ కొడితే చాలును. మర్నాడు పరీక్షలో వచ్చే ప్రశ్నలు తెచ్చేసుకోవడం, జవాబులు తయారు చేసేసుకోవడం, రాత్రికి రాత్రికి బట్టీ పట్టేయడం మర్నాడురానేయడం. అంతే. ఆ తర్వాత

సీతా : ఫెయిలయి పోవడం.... వింటున్నావా జానకీ వీళ్ళ తెలివితేటలూ.... ఒరే కృష్ణా, ఒకవేళ పేపర్లు దొరక్కపోతేనో....

కృష్ణ : ఎందుకు దొరకవూ. దొరికి తీరాలి. అది రూలు. పోతే కొంచెం ఖర్చు అంతే!

సీతా : ఆహా! ఒకవేళ దొరక్కపోతేనో అని.

జాన : అబ్బబ్బ మీతో మహా చెడ్డచావొచ్చి పడింది గదండీ! ప్రతిదానికీ అప శకునం పలుకుతారెందుకూ.

సీతా : వాళ్ళక్షేమంకోరే వాణ్ణిగనుక. నువ్వునోరుమూయ్. ఊఁ! చెప్పరా! ఒక వేళ ప్రశ్నల పేపరు దొరకలేదనుకో, అప్పుడేం చేస్తావు! మరి క్లాసు పుస్తకాలను ముఖమైనా చూడటం లేదుగదా!

కృష్ణ : ఏముందీ! నేరుగా పరీక్ష హాల్‌లోకి గైడ్సులో అవసరం అనుకున్న పేజీలు చించి పట్టుకు పోవడమే.

సీతా : అక్కడ నిన్ను కాపీ కొట్టనివ్వక పోతేనో?

కృష్ణ : ఎందుకు కొట్టనివ్వరూ వాళ్ళకు స్టూడెంట్లు అంటే ఏమిటో తెలుసుగా

సీతా : (వ్యంగ్యంగా) వెరీగుడ్. మీమూలంగా నాకు తెలియని విషయాలు తెలుసుకొని జ్ఞానోదయం అయింది చాలు. ఒరే కృష్ణా ! నువ్వు నాదగ్గ రుండి బుద్ధిగా చదువుకుంటావనీ, క్రమశిక్షణతో పెరుగుతావనీ, మీఅమ్మ కొండంత ఆశతో నాదగ్గర పెట్టిందిరా. నీకు విద్యాబుద్ధులు చెప్పడం నా తరం కాదు కదా, నిన్నూ, నన్నూ పుట్టించిన ఆ బ్రహ్మతరంకూడా కాదురా. ఈ సంవత్సరం ఎలాగో ఇక్కడ తగలెట్టి, మళ్ళీ సంవత్సరంలో ఊరెళ్ళి చదువుకో బాబూ ! ఒరే మధూ ! కృష్ణా ! మీకిప్పుడే చెప్తున్నాను. మీరవలంబిస్తున్న పద్ధతులు మంచివికావు. పరీక్షలకి ఇంకా చాలా టైం ఉందీ, మీ పిచ్చిపిచ్చి ఆలోచనలు కట్టిపెట్టండీ. ఏ రోజు పాఠాలు ఆ రోజు చదివేసుకుంటే ఇందాక మీరు సెలవిచ్చిన అడ్డదార్లు తొక్కనక్క ర్లేదు. సుళువుగా పాసవుతారు. నా మాట వినండి అర్థమైందా.

జాన : అయిందా మీ హితబోధ. ఇంకా ఉందా.

సీతా : మధ్య నీ తొందరేమిటే ?

జాన : భోజనాలు వడ్డిస్తా.

సీతా : భగవంతుడు నిన్ను రెండు పనులకోసం పుట్టించేడు. ఒకటి తిండి, రెండు నిద్ర. పదండి.

(తెర)

# రంగం - 3

(రంగాలంకరణలో మార్పులేదు. సమయం రాత్రి. మధు, కృష్ణ చదువుతూ ఉంటారు. మధుకు జ్వరం వచ్చింది. చలివేస్తుంది. కొంచెం వణుకుతూ ఉంటాడు. కృష్ణ చదువుతూనే కునికిపాట్లు పడుతూ, మధ్య మధ్య లేచి అకస్మాతుగా గట్టిగా చదివేస్తూ, మళ్ళీ కునుకుపాట్లు పడుతూ ఉంటాడు.)

మధు : (జ్వరంతో వణికిపోతూ) ఒరే కృష్ణా ! కృష్ణా !

కృష్ణ : (గురక తీస్తుంటాడు)

మధు : (తట్టి, గట్టిగా) కృష్ణా !

కృష్ణ : (అకస్మాత్తుగాలేచి పాఠం గట్టిగా చదువుతాడు)

మధు : ఒరే కృష్ణా ! ఇటూ ! ఇటు వినరా బాబూ !

కృష్ణ : ఏరా !

మధు : నాకు చలిగా ఉందిరా (వణుకుతూ) ఆ దుప్పటి కప్పరా. (పైకిచూస్తూ) ఆ ఫ్యాన్ కాస్త ఆపరా,

కృష్ణ : ఏప్రెల్‌నెలలో చలేమిట్రా, కొంపతీసి జ్వరం రాలేదుకదా, ఏదీ చూడనీ! (మధు చెంపలమీద, చేతుల మీద చెయ్యివేసిచూస్తూ) అవునా! (గట్టిగా) జ్వరం వచ్చిందిరా!

మధు : ఉష్! గట్టిగా అరవకురా, నాన్నారు లేచిపోతారు, నీ దగ్గరొక జ్వరం మాత్ర ఉండాలి. ఉందా?

కృష్ణ : అవునొరే ఉండాలి. వెతికిస్తానుండు. (పుస్తకాల్లో వెతికి) ఆఁ దొరికింది. ఇంద. ఫ్లాస్కులో టీ ఇస్తానుండు. (తీసిచూసి) అరె! టీ అయిపోయిందిరో ఉండు అత్తయ్యను లేపుతాను.

మధు : మెల్లిగా లేపరా అమ్మను. నాన్న వినగలరు (వణుకుతూ మూలుగుతూ ఉంటాడు)

కృష్ణ : (సైడ్‌వింగు దగ్గరకెళ్ళి, రహస్యంగా) అత్తయ్యా! అత్తయ్యా!

జాన : (లోపల్నుండి గట్టిగా) ఆఁ ఆఁ ఏం కావాలిరా! (ఆవులిస్తుంది)

కృష్ణ : (మెల్లగా రహస్యంగా చెప్తున్నట్టు) అరవకత్తయ్యా? మధుకి "టీ" కావాలంట.

జాన : ఫ్లాస్కులో పోసుంచేను.

కృష్ణ : అయిపోయింది. మధుకి కావాలంట.

జాన : అలాగే పెడతా (ఆవులించి) క్షణం ఆగండి

సీతా : (లోపల్నుండి గట్టిగా) టైం ఎంతైందిరా అబ్బాయిలూ!

కృష్ణ : ఒకటింబావు మామయ్యా! (గట్టిగా)

సీతా : (లోపల్నుండే) ఇంక నిద్రపొండిరా! చాలా పొద్దుపోయింది.

కృష్ణ : (గట్టిగా) అలాగే మామయ్యా! (రహస్యంగా) అత్తయ్యా! ముందు టీ పెట్టివ్వు. మధుకి జ్వరం వచ్చింది. మాత్ర ఇవ్వాలి.

జాన : జ్వరమే (కంగారుగా వచ్చి) ఏదీ చూడనీ.

మధు : (వణుకుతూ, మూలుగుతూ ఉంటాడు)

జాన : (నుదుటిమీద చెయ్యివేసి చూచి, కంగారుగా, గట్టిగా) అవున్రా జ్వరమే. ఉండు మీనాన్నగారిని లేపుతా.

మధు : (మెల్లగా) హబ్బా ! అరవకేఅమ్మా. నాన్నగారు వచ్చేస్తారు. మాత్ర వేసుకుంటే అదే తగ్గిపోతుంది.

సీతా : (లోపల్నుండి) ఏరా ! ఇంక నిద్రపోలేదూ ! ఈవేళకి చదువు చాలించి పడుకోండి. వేడిచేస్తుంది.

కృష్ణ : (గట్టిగా) అలాగే మామయ్యా !

జాన : ఉండండి టీ తెస్తాను (లోపలికి వెళ్ళింది)

కృష్ణ : ఇప్పుడెలాగరా మధూ ! మామయ్యకు తెలుస్తే....

మధు : (నీరసంగా) దిక్కుమాలిన జ్వరం ఇప్పుడే రావాలా....

సీతా : (లోపల్నుండి) జ్వరం వచ్చిందటగా మధూ !

కృష్ణ : చంపేసింది అత్తయ్య. చెప్పేసింది కాబోలు,

సీతా : (వస్తూ కంగారుగా) అనుకున్నంత పనీ అయింది. (నుదుటి మీద చెయ్యి వేసి చూసి) పదరా మధూ ! డాక్టరు దగ్గరకెళ్దాం.

కృష్ణ : జ్వరం మాత్రఉంది మామయ్యా నాదగ్గిర.

మధు : ఇప్పుడీ మాత్ర వేసుకుంటాను నాన్నా, తగ్గకపోతే ఉదయం డాక్టరు దగ్గరికెళ్దాం.

సీతా : సరే నీ ఇష్టం, ఆ మాత్ర ముందు వేసుకో, పరీక్షలు పట్టుమని పదిరోజు ల్లేవు. ఇప్పుడెలాగ ? అందుకే చిలక్కి చెప్పినట్టు చెప్పేను. నామాట విన్నావుకాదు. ఇప్పుడు వొంటికి తెచ్చుకున్నావు. ఇది తగ్గేదెప్పుడూ ! నువ్వు చదివే దెప్పుడు ?

జాన : (టీతో వస్తూ) జ్వరంతో వాడు కుయ్యో మొర్రో అంటుంటే మధ్య మీ సణుగుడేంటి ! ఇందరా మధూ టీ ! ఈ మాత్ర వేసుకొని నిద్రపో.... ఉదయం డాక్టరు దగ్గరికెళ్దువుగాని.

మధు : అలాగే (మాత్రవేసుకుని, టీ త్రాగుతాడు)

సీతా : అందుకే నేను చెప్పేను........

జాన : ఇంక మీరు లోపలికెళ్ళి పడుకుంటారా.

సీతా : ఏమిటో : పిల్లలు. మనస్తిమితం ఉండనివ్వరు. నేనిక్కడే ఉంటాలే.

జాన : మీరిక్కడుంటే వాడికి నిద్ర పట్టనివ్వరు. మీరు లోపలికి వెళ్ళండి. నే నిక్కడే ఉండి చూచుకుంటాను.

సీతా : (లోపలికి వెళ్తాడు)

(తెర)

# రంగం-4

(సమయం రాత్రి)

(రంగాలంకరణ మారదు. మంచం మీద మధు పడుకున్నాడు. నుదుటి మీద గుడ్డముక్క. ప్రక్కన జానకమ్మ కూర్చుని నుదుటిమీద గుడ్డపైన నీళ్లు వేస్తున్నది.

సీతా: (వస్తూ) ఎలాఉందిరా జ్వరం (పక్కన కూర్చుంటూ) ఏమయినా తగ్గిందా!

జాన: (లేచి పక్కన నిలబడి) లేదు అలాగే ఉంది. డాక్టరుగా రేమంటారు?

సీతా: టైఫాయిడ్ అంటాడు.

జాన: తెల్లారితే పరీక్షలు. ఇంకేంవెళ్తాడు.

సీతా: అందుకే నేను మొదటి నుండి మొత్తుకుంటున్నాను. నామాట వింటేనా. ఈ సంవత్సరానికి వీడి పరీక్ష గోవిందా.

జాన: మళ్ళీ ప్రారంభించారూ! సతాయింపు. కాస్త ఆగండీ.

సీతా: ఈ కిష్టిగాడేడీ!

జాన: పాతిక రూపాయలు పుచ్చుకొని తొమ్మిది గంటలకు వెళ్ళేడు. ఇంకా రాలేదు. ఎక్కడకెళ్ళేడో ఏమో?

సీతా: (వెటకారంగా) ఇంకెక్కడికి పరీక్షా పత్రాల కోసం. (కోపంగా) బుద్ధిలేక పోతే సరి.

జాన: మధ్య నన్ను తిడతారెందుకూ?

సీతా: నిన్ను కాదులే. వాణ్ణి, ఈ కాలపు కుర్రాళ్ళకి కష్టపడి చదువుకుందామని ఉండదు, ఎంతసేపూ కాపీలు కొట్టో, పేపర్లు సంపాదించో, లంచాలిచ్చో పాసైపోదామనే ధ్యాసే తప్ప మరేం లేదు. ఊఁ! మధుకి గ్లూకోజ్ ఇచ్చేవా?

జాన: ఇచ్చేను.

వాణి: (దూరంగా చదువుకుంటున్నట్టు వినవస్తుంది)

సీతా: వాణీ! (పిలుస్తాడు)

వాణి: ఏం నాన్నా! (పుస్తకం చేతిలో పట్టుకొని వస్తుంది)

సీతా : ఇంక నిద్రపోరాదూ! చాలాపొద్దుపోయింది.

వాణి : అలాగే నాన్న

సీతా : పాఠాలన్నీ చదివేసుకున్నావా!

వాణి : ఎప్పుడో.

సీతా : అన్నీ రివిజన్ చేసుకున్నావా!

వాణి : ఓ!

సీతా : గుడ్ గర్ల్. మరైతే వెళ్ళినిద్రపో,

వాణి : అలాగే నాన్నా. (లోపలికి వెళ్ళింది)

సీతా : చూశావటోయ్. దీనిలాగా వాళ్ళు చదువుకుంటే ఇన్ని తిప్పలుండకపోయేవి. టైంవేస్టు అయ్యేదికాదు. ఖచ్చితంగా పాసై ఉండేవారు.

(ఇంతలో ఒక కుర్రవాడు పరుగెత్తుకుంటూ వచ్చి, రొప్పుకొంటూ ఆయాస పడుతూ...)

కుర్రా : సీతాపతిగారిల్లు ఇదేనా అండి.

సీతా : ఆఁ! ఇదే. ఎవరు కావాలి బాబూ!

కుర్రా : (దువ్వెన తీసి షోగ్గా దువ్వుకుని) సీతాపతిగారూ మీరేనా అండీ!

సీతా : అవును బాబూ! ఎందుకూ!

కుర్రా : ఏం లేదు. (అంటూ జేబులో నుండి చిన్న అద్దం తీసుకొని ముఖం చూసుకొని దువ్వెనతో మరోసారి దువ్వుకుంటూ ఉంటాడు)

సీతా : (ఆ కుర్రాడి వ్యవహారం చూసి) ఏం లేకపోతే ఎందుకొచ్చినట్టూ?

కుర్రా : కృష్ణ అంట....

సీతా : ఆఁ! కృష్ణ....?

కుర్రా : (మళ్ళీ తల దువ్వుకుంటుంటాడు)

సీతా : (వళ్ళుమండి) చూడుబాబూ! అర్ధరాత్రిపూట నీ అందచందాలు చూడ్డానికి ఎవరికీ తీరుబడిలేదు గాని, ఆ సింగారించుకోవడం ఆపి వచ్చిన పని చెప్తావా!

కుర్రా: ఆ అబ్బాయి క్వశ్చన్ పేపర్లకోసం రోడ్డు మీద పరుగెడుతుంటే పోలీసులు పట్టుకున్నారు. మీ అడ్రసు చెప్పి మిమ్మల్ని తీసుకురమ్మని చెప్పేడండీ. (మళ్ళీ తల దువ్వుకోవడం, అద్దంలోకి చూసుకోవడం ప్రారంభిస్తాడు.)

సీతా: (ఆ కుర్రాణ్ణి ఎర్రగా చూసి, అతని చేతిలోని దువ్వెన, అద్దం, తీసుకుని అతని జేబులో కుక్కి) ఈ కాలపు కుర్రకారుకు చదువు అబ్బక పోయినా ఈ జబ్బుబాగా అబ్బింది. ఇంతకీ మావాడెక్కడున్నాడట ?

కుర్రా: (కోపం వచ్చి విసురుగా) మెయిన్‌రోడ్డు మీద గంటస్తంబం జంక్షన్ దగ్గర (అని ఎర్రగా చూసి, కాలర్ సర్దుకొని వెళ్తాడు.)

సీతా: చంపేడు వెధవ పీనుగ. వీడికోసం పోలీసుల చుట్టూ నేనెక్కడ తిరగనూ?

జాన: పనిమాలీ వాణ్ణెందుకండీ పోలీసులు తీసుకెళ్ళేరు ?

సీతా: కబాడీ ఆడుకోడానికి

జాన: మీరు మరీనూ ! ముందువెళ్ళి వాణ్ణి తీసుకురండి.

సీతా: వెళ్ళక వెళ్ళక తిన్నగా కబంధహస్తాల్లోకే వెళ్ళేడు. ఆ బంధాల నుండి విడిపించుకు రావాలంటే మాటలా ! తలప్రాణం తోకకి వస్తుంది. ఈ క్షణం వరకూ అ మధుగాడి కోసం ఆస్పత్రీ ఇంటికీ తిరగలేక సగం ప్రాణాలు పోయేయీ ! ఆ మిగతా ప్రాణాలూ ఇప్పుడా కృష్ణగాడి కోసం ఆ పోలీసుల చుట్టు తిరగలేక పోతాయి.

జాన: ఏదో ఒకటిచేసి వాణ్ణి త్వరగా తీసుకురండి తెల్లారితే పరీక్షలాయె.

సీతా: వెళ్ళక తప్పుతుందా మరి. (అని బయలుదేరుతాడు)

మధు: (నీరసంగా) అమ్మా ! దాహంవేస్తుందే !

జాన: (గ్లాసులో నీళ్ళు పోసి ఇస్తుంది)

మధు: (కొంచెం లేచి తాగి ఇస్తాడు గ్లాసును) వాణీ ఏదీ !

జాన: పడుకుంది.

మధు: కృష్ణ ఏడీ ?

జాన: బయటకెళ్ళేడు, వాడిని అక్కడ పోలీసులు పట్టుకుంటే వాడిని విడిపించుకు రావడానికి మీనాన్నగారు వెళ్ళేరు.

సీతా : (కృష్ణతో వస్తూ) జానకీ! హారతి పట్రా, కృష్ణ పరమాత్మలవారు విచ్చే సారు.

జాన : ఇంతవేగమే ఎలావచ్చేసారూ! రారా కృష్ణా!

సీతా : వాడిని పోలీసులు ఈదారంటే తీసుకెళ్తున్నారు. నేను వెళ్ళడం ఇంకొంచెం ఆలస్యం జరిగివుంటే ఈసరికి అయ్యగారు పోలీస్‌స్టేషన్ లాకప్‌లో ఈ రాత్రికి రెస్టుతీసుకొని వుండేవారు. వాళ్ళను బ్రతిమిలాడి హామీ ఇచ్చి రేపు పరీక్షలని చెప్పి తీసికొచ్చేను. అక్కడికి వెళ్ళివుంటే తెలిసేది అయ్యగారికి.

జాన : ఇంక చాల్లెండి చీవాట్లు. ముందు పరీక్షలకి చదువుకోనివ్వండి.

సీతా : వీళ్ళకింక ఇప్పుడు పరీక్షలెందుకూ. మళ్ళీ సంవత్సరమే గతి. ఈయేడాది వీళ్ళ పరీక్షలు చెట్టెక్కినట్టే. ఒక సంవత్సరం టైము అనవసరంగా దండగైనట్టే.

మధు : (నీరసంగా) రేపు నన్ను పరీక్షకు తీసుకెళ్తే....

సీతా : మిమ్మల్నిద్దర్నీ పరీక్షకు కూర్చోబెట్టి అచ్చుపుస్తకాలూ, గైడ్సు మీ ముందు పడేసినా జవాబులు ఎక్కడున్నాయో తెలియని అయోమయ పరిస్థితులో వున్నార్రా మీరు, మీకెందుకూ పరీక్షలు.

జాన : మీరూరుకుందురూ.

సీతా : ఈ వెధవలకి శిక్ష జరగాల్సిందే. వీళ్ళేకాదు. ఇలాంటి ఆమాంబాపతు, అంటే, పరీక్షలముందు చదివేద్దామనుకునేవారు, ప్రశ్నపత్రాలు సంపాదించాలనుకొనేవారూ, కాపీకొట్టో, లంచాలిచ్చో పాసై పోదామనుకొనే వాళ్ళందరికీ ఇలాంటి ప్రాయశ్చిత్తం జరగాల్సిందే. అప్పటికి గాని బుద్ధి రాదు. ఏరోజు చెప్పిన పాఠాలు అరోజు చదువుకొండిరా, పరీక్షల ముందు ఇబ్బంది వుండదు అని ఎప్పట్నుండో చెప్తున్నాను. విన్నారా! లేదే. మరిప్పుడేమైంది. మొదటికే మోసం వచ్చింది. నీతిగా, నిజాయితీగా కష్టపడి చదువుకొని పాసవ్వడానికి ప్రయత్నించండిరా. అప్పుడే ఆ చదువు అర్థం, ప్రయోజనం వుంటుంది. దాన్ని చూడండి. వాణి ఎంత నిశ్చింతగా నిద్రబోతుందో. చక్కగా సంవత్సరం పొడుగునా చదువుకుంది. ఆత్మ

విశ్వాసం పెంచుకుంది, నిశ్చింతగా వుంది. రేపది ఫస్టుక్లాసైన మార్కులతో గ్యారంటీగా పాసవుతుంది. నేను చెప్తున్నది అర్థమౌతుందా కృష్ణా!

కృష్ణ : ఆఁ!

సీతా : నేనప్పుడే చెప్పేను. "మీరవలంబిస్తున్న పద్ధతులు మంచివి కావూ, అడ్డ దార్లు తొక్కకండిరా, చక్కని రాజమార్గంలో వెళ్ళండిరా"అని. గుర్తుందా ఏరా మధూ!

మధు : (తప్పు చేసిన వాడిలా) గుర్తుంది.

సీతా : ఇహనైనా బుద్ధితెచ్చుకొని నా సలహా ప్రకారం చదువుకుంటే బాగుపడ తారు. తెలిసిందా. ఏరా మధు!

మధు : అలాగే నాన్నా.

సీతా : ఏరా కృష్ణపరమాత్మా.

కృష్ణ : అలాగే మామయ్యా!



# పరీక్ష చదువులు



## కొట్టిపాటి గంగాధరరావు

పాత్రలు :

రంగడు
రాముడు
కృష్ణుడు
మేష్టారు

(సామాన్యపు గది)

మధ్యలో ఒక టేబుల్, రెండు కుర్చీలు, ఒక ప్రక్క పక్క వేసిన మంచం. తెర ఎత్తేసరికి కుర్చీలలో కూర్చుని రాముడు కృష్ణుడు చదువుకుంటుంటారు. మొదట కూర్చుని చదువుతారు. తర్వాత రాముడు ఆవలిస్తాడు. వాణ్ణిచూచి కృష్ణుడూ., రాముడు లేచి పచార్లు చేస్తూ చదువుతాడు. కృష్ణుడు వాణ్ణిచూచి తనూలేచి పచార్లు చేస్తూ చదువుతాడు. కొంత సేపయిన తర్వాత రాముడు బిగ్గరగా చదవ నారంభిస్తాడు. కృష్ణుడు కూడా బిగ్గరగా చదవ నారంభిస్తాడు. ఇద్దరూ ఒకరికంటె ఎక్కువగా ఒకరు చదువుతూ వుంటారు. బాగా పెద్దగా చదువుతుంటే లోపల్నించి రంగడు గబగబా పరుగెత్తుకువస్తాడు.

**రంగడు :** ఒరే ! ఒరే ! ఏమిట్రా ఈ చదువు ? ఇంటి పెంకులు ఎగిరిపోతున్నాయి.

**కృష్ణుడు :** వాడేరా – నాకంటే బిగ్గరగా చదువుతున్నాడు.

రాముడు : నాకు పైకి చదివితేగాని అర్థం కాదుమరి!

కృష్ణుడు : నువ్వు పైకి చదివితే నాకర్థం కాదు.

రంగ : మీరిద్దరూ యిల్లెగిరి పోయేటట్లు చదివితే నాకే కాదు, మన మాష్టారికి కూడా అర్థం కాదు, మరెట్లా? ముగ్గురం పైకి చదివితే పెంకులన్నీ పైకి ఎగిరిపోతే రేపొద్దున చూసిన వాళ్ళందరికి పెంకులు ఎందుకెగిరి పోయాయో అర్థంకాదు. పరీక్షలింకా రెండురోజులున్నాయి.

రాముడు : ఊఁ! అందరం లోపలే చదువుకుందాం, కానియ్యండి.

రంగడు : ఆ - లోపలే చదవండి, వస్తా.

పాఠాలు తీసి మళ్ళీ చదువుతారు. రాముడు నిమ్మదిగా ఆవులిస్తాడు. వాణ్ణిచూచి కృష్ణుడూ ఆవలిస్తూ)

కృష్ణుడు : ఒరేయ్ - నాయెదుట కూర్చొని వూరికే ఆవలించకు.

రాముడు : నేనావులిస్తే నీకేం?

కృష్ణుడు : నువ్వు ఆవులిస్తే నాకు ఆవులింతలొస్తాయి.

రాముడు : నిద్రవస్తుంటే ఆవలింతలు ఎవరికయినా వస్తాయి.

కృష్ణుడు : నీకు నిద్ర రాకపోతే నాకూ రాదు.

రాముడు : కానియ్యి, చదువుకునే కాసేపూ కబుర్లు చెప్పకు

(ఇద్దరూ చదవనారంభిస్తారు.)

రాముడు : ఓరేయ్ వాడెవడ్రా వాడూ తెగనిద్రపోతాడూ రాక్షసుడు.

కృష్ణుడు : వాడా.... ఎవరికో అన్నగారవుతాడ్రా.... ఎవరికంటే?

రాముడు : ఆ. జ్ఞాపకం వచ్చిందిలే జ్ఞాపకం వచ్చింది.

కృష్ణుడు : ఎవడ్రా?

రాముడు : మాబళ్ళో 'కృష్ణుడు' అని ఒక కుర్రాడున్నాడు. వాడికి నామాంతరమే కుంభకర్ణుడు.

కృష్ణుడు : ఆ నేనే! నేనా కుంభకర్ణుణ్ణి,

రాముడు : నిన్నెవరన్నారోయ్! మా బళ్ళో నలభై మంది వున్నారు.

కృష్ణుడు : సరేలే (ఇద్దరూ కాస్సేపు మళ్ళీ చదువుతారు)

కృష్ణుడు : ఒరేయ్. తుగ్లక్ పూర్తిపేరేమిట్రా

రాముడు : అదా.... అది.... మహమ్మద్.... మహమ్మద్.. (సరిగ్గా జ్ఞాపకం రాక)

కృష్ణుడు : ఆ ఆ జ్ఞాపకం వచ్చిందిలే మహమ్మద్ రామారావు బీ తుగ్లక్

రాముడు : నేను తుగ్లక్ నా?

కృష్ణుడు : నిన్నెవరన్నారోయ్ నేను తుగ్లక్ పేరు చెప్పితే

రాముడు : సరేలే? ఈ తడవ అనుమానం వచ్చినప్పుడు చెప్తాలే

కృష్ణుడు : నాకింక అనుమానాలు రావులే

(ఇద్దరూ చదువుకుంటారు. మళ్లా రంగడు ప్రవేశించి)

రంగడు : ఒరే ఒక అనుమానం వచ్చింది. చెప్పండిరా.... కరటకదమనకులు మనుషులా ? జంతువులా ?

(రాముడూ కృష్ణుడూ మొహమొహాలు చూచుకుంటారు)

రంగడు : మొహమొహాలు చూసుకుంటారేమిట్రా అనుమానం వచ్చి అడిగితే !

కృష్ణుడు : ఏడిసావ్‌లే పనిగట్టుకు వచ్చావ్ ! మేం చెప్పం.

రాముడు : అంతే చెప్పద్దు – మనం చెప్పకపోతే నువ్వు కరటకుడు నేను దమనకుడూ అంటాడు.

కృష్ణుడు : ఏడిశావ్ ! నిన్నే కరటకుడూ నన్ను దమనకుడూ అంటాడు.

రంగడు : సరేలే చెప్పరుకాదూ, సరే ఈ తడవ మీయిద్దరికీ అనుమానం రాదు ? అప్పుడు చెప్తా (వెళ్లను)

కృష్ణుడు : టైము ఎంతయిందిరా ?

రంగ : పదిగంటలు, ఏం? అప్పుడే నిద్రవస్తోందా ?

కృష్ణుడు : నిద్రవస్తోంది. నేను కాసేపు పైకి చదువుకుంటారా !

రాముడు : చదువుకో.

కృష్ణుడు : నువ్వా పైకి చదవకూడదు.

రాముడు : చదవనులే (కృష్ణుడు పైకి చదువుతూ)

కృష్ణుడు : లావొక్కింతయు లేదు. ధైర్యము విలోలంబయ్యె (అనే పద్యం చదివి) ఒరేయ్ యీ పద్యం ఎవరు రాశార్రా ?

రాముడు : ఇదా ? ఒక డాక్టరుగారు రాశివుంటారు.

కృష్ణుడు : డాక్టరు గారా !!!

రాముడు : ఆ డాక్టరుగారు. చూడరాదు! రోగిని చూసి "లావు ఒక్కింతయులేదు" ఈ రోగి కొద్దిగానన్నా లావులేడు. అంటే బాగా చిక్కిపోయినాడన్నమాట. 'ధైర్యము విలోలంబయ్యె' డాక్టరు గారికి ధైర్యం ఊగిసలాడుతోంది. రోగికి 'ప్రాణముల్ దప్పెను మూర్ఛవచ్చె. తనువున్ డస్సెన్' నయంచేయలేక డాక్టరు గారికి శరీరం అలిసి పోయింది.... చివరికి 'నీవే తప్ప నితఃపరం బెరుగ' నాకు గతినువ్వే, వేరెవ్వరూ లేరు 'మన్నింపం గదే దీనునిన్' ఈ రోగిని ఓ దేవా క్షమించు అని అర్థం.

కృష్ణుడు : ఏడిశావ్ ఇది ఒక ప్లీడరుగారు వ్రాశారు, చూడు 'లా వొక్కింతయులేదు' ఈ కేసులో 'లా' కాస్తన్నా లేదు.... చివరికి నీవే తప్ప నితఃపరం బెరుగ ఓ జడ్జీగారూ మీమీదే నా ఆశలన్నీ పెట్టుకున్నాను. వేరెవ్వరి మీదా పెట్టుకోలేదు. 'మన్నింపంగదే దీనునిన్' ఈ దీనుణ్ణి మన్నించి కేసు గెలిపించండీ అని.

రాముడు ! ఏడిశావ్, కాదు. అది వ్రాసింది డాక్టరుగారే.

కృష్ణుడు : అట్టే వాగకు, నాకు బాగా తెల్సు. ఆ డాక్టరుగారు మానాన్న గారికి కూడా తెల్సు. పేరేదో జ్ఞాపకం లేదు.

కృష్ణుడు : ఏడిశావ్, కాదు. కావాలంటే రంగణ్ణి అడుగు.

రాముడు : పిలు, రంగణ్ణి కనుక్కుందాం

కృష్ణుడు : రంగడూ ! రంగడూ ! ఇట్లా రారా ! ఈ పద్యాని కర్థం చెపుదూగాని

(రంగడు వస్తాడు)

రంగడు : పద్యానికి అర్థం చెప్పాలా. ఏపద్యం?

రాముడు : 'లావొక్కింతయులేదు' అనే పద్యం

రంగడు : అలా ! ఇదేనా ! ఈ మాత్రం తెలియదురా ! ఇది భస్మాసురుడు వెంట పడుతుంటే శివుడు పాగిపోతూ పాడిన పద్యం.

రాముడు : మరి, 'లా' అంటే ఏమిటి ?

రంగడు : 'లా' కాదు, లావు అంటే ధైర్యం

రాముడు : 'లావ'ంటే ధైర్యమయితే మళ్ళీ 'ధైర్యము విలోలంబయ్యె' అన్నాడేం ?

రంగడు : అంటే అన్నాడు. మధ్య నీ యిష్టమేమిటి ?

కృష్ణుడు : సరే, రేపు మాష్టార్ని కనుక్కుందాంలే, ఇక చదవండి అబ్బ! బాగా నిద్రవస్తోంది - రంగడూ నువ్వా యిక్కడే చదవరాదురా !

రంగడు : నేనిక్కడ చదివితే మిమ్మల్ని చూసి నాకూ నిద్రవస్తుంది.

రాముడు : ఫర్వాలేదు చదువు.

(ముగ్గురూ చదువుతారు-ముగ్గురికీ ఆవలింతలు వస్తాయి)

కృష్ణుడు : పైకి చదువుదాం రా ! నిద్ర పోతుంది.

రాముడు : ఆ....సరే....

(ముగ్గురు పైకి చదువుతారు. కృష్ణుడు చదువుతూ చదువుతూ ప్రక్క పేజీలో ఏదో సినిమా కాగితం వుంటే అది చదువుకు పోతాడు పాఠంలో కలిపి)

"మంచి తరుణము మించిపోవును"

1-2-58 ఆదివారము "రెండు ఆటలు"

కేసరీసినిమా హాలులో

"బలే చౌక బేరము"

రాముడు : ఇదేమిట్రా పాఠంలో కలిపి సినిమాలు వస్తున్నాయి.

కృష్ణుడు : సినిమా కాగితం వెధవది. (అది పారేసి పాఠం చదువుతాడు.)

(ముగ్గురూ చదువుకుంటుంటే, ముగ్గురికీ నిద్ర వస్తూంటుంది. తూలి పడబోయి మెలుకువ తెచ్చుకొని చదువుతుంటారు. చివరికి కృష్ణుడు పుస్తకంమీదికి వాలి నిద్రపోతాడు.)

రాముడు : ఒరే ! నిద్రపోతున్నావా ?

కృష్ణుడు : బాగా నిద్ర వస్తోందిరా !

రాముడు : నువ్వు నిద్రపోతే మాకూ నిద్రవస్తోందిరా.

కృష్ణుడు : నిద్రవస్తే నిద్రపో.

రాముడు : మరి పరీక్ష !

కృష్ణుడు : వెధవ పరీక్ష పోతే మళ్లీ వస్తుంది.

రాముడు : సరే కానీ, నువ్వు పాస్ అయితే నే నవనా ? నేనూ నిద్రపోతా.

రంగడు : ఇదేమిట్రా మరి నేనో !

రాముడు : నువ్వూ నిద్రపో.

రంగడు : ఏడిసినట్టుంది. ఆసలే ఆ మాష్టారుకు నామీద కోపం.

రాముడు : నీ ఖర్మానికి నేనేం చెయ్యను.

రంగడు : సరేలే ! చూసుకో ! నన్నిక్కడికి పిల్చి మీరిద్దరూ నిద్రపోతారు కదూ.... కానీ....

(రాముడు ఓ ప్రక్క పడుకుని నిద్రపోతాడు. రంగడు కొంత సేపు ఓపద్యం బట్టీ పడ్తాడు. నిద్ర వస్తూంటుంది. వాళ్లిద్దర్ని కొరకొరా చూస్తాడు. పద్యం సహంలో ఆపి, ఉక్రోషంతో)

రంగడు : ఒరేయ్ - లేవరా ! నాకూ నిద్ర వస్తోంది.

రాముడు : నువ్వూ నిద్రపోరా, యివ్వాల్టికి.

రంగడు : నాకీ పద్యం రాలేదురా

రాముడు : తలక్రింద పెట్టుకు పడుకో, అదే వస్తుందిలే.

రంగడు : ఏడిశావ్ వెధవా ! సరే, లేవవ్ కాదూ ? సరే నాకేం ! నీకే బండి సున్న వస్తుంది పరీక్షలో.

(చదవనారంభిస్తాడు. నిద్ర బాగా వచ్చి తూగిపోతుంటాడు. రాముడిమీద కోపం బాగా వస్తుంది. రాముడు కృష్ణుడూ గుర్రు ప్రారంభిస్తారు. రంగడు ఆగి వాళ్లను చూస్తాడు చివరికి)

రంగడు : మీరు గుర్రుకూడా కొడితే ఎట్లాగురా!

(వెళ్లి వాళ్ల ముక్కు దగ్గర వేలుపెడతాడు. గుర్రు ఆగిపోతుంది. తను చదువుతుంటాడు రెప్పలు వేళ్లతో ఎత్తి చదువుకుంటాడు. కుర్చీలో నల్లుల్ని చంపుతాడు. మళ్ళీ చదువుతాడు. ఆగి దోమను చంపినట్లు చేతిమీద కొట్టుకుంటాడు. మళ్లా చదువుతాడు. నిద్ర తూగివచ్చి పుస్తకంమీద వాలి నిద్రపోతాడు. అకస్మాత్తుగా లేచి పెద్దగొంతుతో చదువనారంభిస్తాడు. చదువుతూ చదువుతూ దోమ తన కళ్లముందు ఎగురుతున్నట్లు చూస్తూ చూపుల్తో చేతులు బాగా పైకి ఎత్తి, చప్పట్లు కొట్టినట్లు కొడతాడు. దోమను చంపటానికి. మళ్ళీ చదువుతాడు. కుర్చీలో కూర్చున్నవాడు గొంతుకుకూర్చుని కొంతసేపు, ఒక కాలుకిందా ఒక కాలు పైనా పెట్టుకొని కొంతసేపు, అలాగే కాళ్లు మార్చి కొంతసేపు నుంచునీ, చదువుతాడు. అంతలో కృష్ణుడు కలవరిస్తూ లేచి)

కృష్ణుడు : కుంభకర్ణుడు!! కుంభకర్ణుడు!! (అంటూ అరుస్తాడు)

రంగడు : ఏడీ? ఎక్కడా?

కృష్ణుడు : అట్లాగా! (వాడి వంక చూస్తూ కూర్చుంటాడు కదలకుండా)

రంగడు : అట్లాచూస్తావేంరా నాకు భయమేస్తోంది.

(కృష్ణుడు మెదలకుండా పడుకుంటాడు)

రంగడు : ఒరేయ్! నిద్రపోకురా, నాకు భయమేస్తోంది.

(కృష్ణుడు లేవడు)

రంగడు : (ఏడుపు గొంతుతో) నే చదువుకోవాలంటే మీరు నిద్రపోతారు కదూ! కానియ్యండి, మీకే పాపం వస్తుంది.

(చదువుకుంటూ వుంటాడు. ఏదో ఆలోచన తట్టింది. కాగితం పుల్లలాగ చుట్టి తీసుకెళ్ళి రాముడి చెవిలో అంటిస్తాడు. రాముడు రెండు మూడు సార్లు విదిలించుకుంటాడు. రంగడు తిరిగి తిరిగి అట్లాగే పుల్లలతో చేస్తాడు. ఒక్కసారిగా రాముడు లేచి 'కుంభకర్ణుడు కుంభకర్ణుడు' అని అరుస్తాడు. ఆ కేకలకి కృష్ణుడుకూడా లేచి 'వచ్చాడా! ఏడీ?' అంటూ రాముణ్ణి కావలించుకుంటాడు)

రంగడు : (వాళ్లతో కలిసి తనూ అరుస్తూ)'లావొక్కింతయులేదు' (పద్యం గబగబా చదువుతాడు)

రాముడు : (భయంతో) ఇదిగో నా చెవిలో దూరాడు.

కృష్ణుడు : బాబోయ్! నీ చెవులోనే!

(కావలించుకొని వున్నవాడల్లా ఎగిరి దూరంగా పడ్తాడు)

రాముడు : కల వచ్చినట్టుంధిరా! కలలో కుంభకర్ణుడు కనిపించాడు.

కృష్ణుడు : ఆ కనిపించాడా! నీకూ్కడా?

రాముడు : ఆఁ! ఇక్కణ్ణించి హైస్కూల్‌దాకా పడుకొనివున్నాడు.

కృష్ణుడు : హైస్కూలు దాకానే,

రాముడు : ఆఁ! కాళ్ళేవున్నాయి మర్రిచెట్టు మానంతా!

కృష్ణుడు : మర్రిచెట్టు మానంతే!!

రాముడు : చెవులు చాటల్లాగా ఆడుతున్నాయి.

కృష్ణుడు : బాబోయ్!!

రాముడు : ఊపిరి పీలుస్తుంటే ఆకులూ దుమ్మూ ముక్కులోకి పోయి ఊదినట్లు బయటకు వస్తున్నాయి.

కృష్ణుడు : అమ్మబాబోయ్! నాకు భయంవేస్తోంది.

రంగడు : శ్రీ ఆంజనేయం। ప్రసన్నాంజనేయం। (అని గట్టిగా చదువుతాడు)

(ప్రక్క తెరలోంచి నల్లటిగుడ్డ పూర్తిగా ముసుగు వేసుకొని ఒకవ్యక్తి రామ కృష్ణుల వెనకవైపునుంచి తొంగి చూస్తుంది. ఆ ముసుగు వ్యక్తిని రంగడు చూస్తాడు. రంగడు 'బాబోయ్' అని అరచి వణికిపోతూ...)

రంగడు : కలలో కాదురా, నిజంగానే!

రాముడు :<br>
కృష్ణుడు : } నిజంగానే!

రంగడు : ఆ! అదిగో! అక్కడ కనుపించింది! నల్లగా!

రామడు : } బాబోయ్ ఇక్కడే!
కృష్ణుడు : }

రాముడు : ఎక్కడా!

కృష్ణుడు : ఏడీ!!

రంగడు : అక్కడే మీ వెనక!

రాముడు : } బాబోయ్! (అంటూ దూరంగా పరుగెడుతారు.)
కృష్ణుడు : }

రంగడు : ఆ వాకిట్లో.

రాముడు : ఏడీ! (ముందుకువెళ్లి చూడబోగా)

కృష్ణుడు : వెళ్లకు, పట్టుకుంటుందేమో :

కృష్ణుడు : ఒరేయ్! ఎంత పొడుగుందిరా ?

రంగడు : ఆ, వాకిలిఎత్తు !

రాముడు : అయితే కుంభకర్ణుడు కాదు - వాడు చాలా పొడుగు.

కృష్ణుడు : కాని కామరూపం దాల్చి చిన్నవాడయ్యాడేమో

రాముడు : రాక్షసులు చిన్నవాళ్లయి పోతార్రా ఏమిట్రా! పురుగంతకూడా....

రాముడు : పురుగంతా! అయితే నా చెవులో దూరలేదు గదా ?

రంగడు : దూరలేదు....దూరితే ఆ వాకిట్లో ఎందుకు కన్పిస్తాడు ? ఆగండి,

(అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్లి చూడబోతారు. భయంవేసి వెనక్కి పరుగెత్తుకు వస్తారు. అల్లా రెండు మూడు సార్లుచేసి చివరకు చూస్తారు. "అదిగో అదిగో వస్తోంది. బాబోయ్ మింగేస్తుంది" అని కేకలు తలావకటి వేస్తూ వణికిపోతూ, నుంచుంటారు. నల్లటి ముసుగు వస్తుంది. తలమీద ముసుగు తీసేస్తుంది. పెద్దమీసాలూ తలపాగా మొదలైన వాటితో మాష్టారు కనిపిస్తాడు.)

రాముడు: మాష్టార్రా! ఆ సైన్స్ మాష్టారూ!

మేష్టారు: ఆ సైన్సు మాష్టార్నే! మీరు చదువుతున్నారో నిద్రపోతున్నారో చూట్టానికి వచ్చాను. అంతా చూశాను, రంగడు చదువుతుంటే మీరిద్దరూ నిద్ర పోతున్నారు? ఒరే రంగడూ నువ్వు చదువుకుంటున్నావు గనక బాగా రాయకపోయినా నిన్ను పాస్ చేయిస్తాను. ఒరే! రాముడూ! కృష్ణుడూ! మీరిద్దరు బాగా చదివి బాగా రాయకపోతే ఫేలే. తెలిసిందా, బాగా చదవండి.

(వెళ్లిపోతాడు. రాముడూ కృష్ణుడూ బిక్క మొహాలు వేసుకుని పుస్తకాలు తీసుకుని చదువుకుంటూ కళ్లను నులుపుకుంటూ కూర్చుంటారు.)






పాత్రలు :

గురువు
శిష్యుడు

# రంగం - 1

(దూరంగా గుడిగంటలమోత, కాషాయ వస్త్రాలు ధరించివున్న గురువూ, శిష్యుడూ రంగం మీదికి ప్రవేశించారు. గురువు వృద్ధుడు,గడ్డమూ మీసాలూ తెల్లగా వున్నాయి. చంకలో జోలె, భుజం మీద గొంగళీ చేతిలో దండకమండలాలూ వున్నాయి. శిష్యుడు యువకుడు. అతడి చంకలో జోలెలు వేలాడు తున్నాయి. వాటిల్లో నుంచి పాత్రలూ వగైరా బయటికి కనిపిస్తున్నాయి. నెత్తిన చిన్నమూట, గురువులో సాత్వికత, శిష్యుడిలో వినయ విధేయతలూ ద్యోతక మవుతున్నాయి)

**గురువు :** (ఆయాసంగా ఆగి) హరహర మహాదేవ ! శంభో శంకర .... శిష్యా

**శిష్యుడు :** గురుదేవా !

**గురువు :** (చుట్టూ చూచి) ఇక్కడ ప్రశాంతంగా వుంది. ఈ పూటకు యిక్కడ విడిది చేద్దాం.

**శిష్యుడు :** చిత్తం గురుదేవా.

(గురువు గొంగళి కింద పరచి, ఆయాస పడుతూ కూర్చున్నాడు. శిష్యుడు జోలెలూ మూట కిందికి దించాడు)

గురువు : (శిష్యుడివైపు వాత్సల్యంగా చూస్తూ) కుమారా! నిన్ను చూస్తున్నప్పుడల్లా నాకు ఒక వంక సంతోషం, మరొక వంక జాలి. దేవుడు ఒకరికి కీడు చేయకుండా, మరొకరికి మేలు కలిగించలేడేమో!

శిష్యుడు : క్షమించండి గురుదేవా. తమ మాటలలోని ఆంతర్యం నాకు బోధపడటం లేదు.

గురువు : తీర్థయాత్ర చేస్తున్న నాకు కన్యాకుమారి నుంచి తోడుగా వుంటున్నావు. నాకు సకల సపర్యలూ చేస్తున్నావు. కాటికి కాళ్లు చాచుతున్న సన్యాసిని నేను. ఇంకా ముక్కుపచ్చలైనాఆరని పసివాడివి నువ్వు. జీవితంలోని సుఖాలన్నిటినీ వొదులుకొని, బ్రహ్మచారిగా నావెంట తిరుగుతున్నావు. నా శిష్యరికం వల్లనే కదా నీకీ కష్టాలన్నీ!

శిష్యుడు : అలా అనకండీ గురువర్యా! సుఖం అంటే ఎలా వుంటుందో తమ శిష్యరికంలోనే చూడగలుగుతున్నాను. భోగభాగ్యాలకోసం పరుగులు తీయటం సామాన్యుల లక్షణం, నాకు వైరాగ్యమంటేనే యిష్టం. తమ అడుగుజాడలే నాకు పరమపద సోపానాలు.

గురువు : (చిరునవ్వుతో) వత్సా, వయసుకు తగని మాటలు మాట్లాడుతున్నావు. మనస్సు చంచలమైనది. దానికి నిలకడలేదు. మనస్సు ఎప్పుడు ఎలా మారుతుందో చెప్పలేము. దాన్ని అదుపులో పెట్టుకోవడం వయస్సు ఉడిగిన వాళ్ళకే చేతకాదు. వయస్సులో వున్న వాడివి. నీకు చేతనవుతుందా? నా తిప్పలేవో నేను పడతాను. నన్ను విడిచిపెట్టి, నీసుఖం నువ్వు చూసుకోరాదా?

శిష్యుడు : (దీనంగా) గురువుగారూ! నేను తమకు భారంగా వుంటే....

గురువు : సరే నాయనా! నువ్వు ఎక్కడికీ వెళ్లకు. నాతోనే వుండు.... హరహర మహాదేవ! శంభోశంకర! .... వత్సా! ఈ పూటకు మనం వంటచేసుకోవాలి గదా (జోలెలో చెయ్యివేసి, గురివెంద గింజంత బంగారం తీసి యిస్తూ) ఇదిగో, ఈ బంగారం పట్టుకెళ్ళి ఊళ్ళో అమ్మి సరుకులు కొనుక్కురా!

శిష్యుడు : (బంగారం తీసుకొని, ఒక జోలెలోని పాత్రలు తీసి నేలమీద వుంచి ఖాళీ జోలె చంకకు తగిలించుకొని, అలాగే నిలబడ్డాడు)

గురువు : నిలబడ్డావేం? వెళ్లక?

శిష్యుడు : గురుదేవా!.... (మాటసాగలేదు)

గురువు : (కొంతసేపు వేచి) ఏమిటి?

శిష్యుడు : తప్పు పట్టనంటే ఒకమాట అడగాలని వుంది.

గురువు : అడుగు.

శిష్యుడు : రోజూ గురివెంద గింజంత బంగారం యిచ్చి సరుకులు కొనుక్కురమ్మంటున్నారు గదా. ఈ బంగారం ఎక్కణ్ణించి.... (ఆగి, చేతులు జోడించి) నాకు మహా కుతూహలంగా వుంది గురువుగారూ.

గురువు : (నవ్వి) అదా నీ సందేహం. నా దగ్గిర బంగారం.... (టక్కున మాట ఆపి, ఏదో ఆలోచిస్తూ రెండు క్షణాలపాటు మౌనంగా వుండి) తర్వాత తీరుబడిగా చెబుతాను గాని, వేగిరం వెళ్లి సరకులు పట్టుకురా! కడుపులో ఆత్మారాముడు గోల పెడుతున్నాడు. వంట ప్రారంభించాలి కదా!

శిష్యుడు : ఇదిగో, క్షణంలో వచ్చేస్తా (వెళ్లిపోయాడు)

గురువు : (శిష్యుడు కనుమరుగయ్యే వరకు చూసి) ఆఖరికి అడగరాని మాటే అడిగి ఇరకాటంలో పెట్టేశాడే శిష్యుడు! ఏం చెప్పాలి? వాడికి (జోలెలో చెయ్యివేసి చిన్న బంగారపు ముద్ద బయటికి తీశాడు. దాన్ని చేతితో ఎగరేస్తూ నా దగ్గిరున్న బంగారం యిదీ! ఇందులో నుంచి రోజూ గురివెంద గింజంత బంగారం ఖర్చులకు వాడుతున్నాను. ఈసంగతి శిష్యుడికి తెలియదు. అడుగుతున్నాడు గనుక యిప్పుడు చెప్పాలి కదా! (బంగారాన్ని మళ్ళీ జోలెలో వేసుకున్నాడు) .... శిష్యుడేమో మంచివాడే నమ్మదగినవాడే అయితే బంగారాన్ని నమ్మలేము గదా! మంచితనాన్ని మాయం చేసే గుణం బంగారానికే వుంది. నిజం చెప్పి శిష్యుణ్ణి పాడు చెయ్యటం దేనికి? ఈ బంగారం కోసం వాడు నాకేదైన అపకారం తల పెట్టవచ్చు. అందుచేత, ప్రస్తుతానికి ఏదో ఒక అబద్ధం చెప్పకతప్పదు.

శిష్యుడు : (వచ్చాడు) వచ్చేశాను గురువర్యా, బియ్యమూ కూరగాయలూ తెచ్చేశాను. (జోలె కట్టె పుల్లలూ కిందపెట్టాడు)

గురువు : సరే! పొయ్యి తయారు చెయ్యి! .... ఇందాకా బంగారాన్ని గురించి అడిగావు కదూ? నీకొక రహస్యం చెబుతాను. మరెవ్వరికీ చెప్పకూడదు సుమా!

శిష్యుడు : గురుదేవులమీద ఒట్టు

గురువు : వత్సా! నాదగ్గర బంగారం లేదు. బంగారం తయారుచేసే విద్యవుంది. రాళ్లను బంగారంగా మార్చే మంత్రం నాకు తెలుసు. మన అవసరాలు

గడవటానికి, రోజూ గురువెంద గింజంత బంగారమైనా లేకపోతే ఎలా ? అంతకంటె ఎక్కువ మనకెందుకు ? మనం సర్వసంగ పరిత్యాగులం కదా!

శిష్యుడు : (నిశ్చేష్టుడై వింటూ వుండిపోయాడు)

గురువు : (శిష్యుడి భుజం మీద చెయ్యివేసి) శిష్యా !

శిష్యుడు : స్పృహలోకి వచ్చి, ముందుకు వంగి గురువుగారి పాదాలను కళ్ళకు అద్దుకున్నాడు)

గురువు : నాయనా ! నీగురు భక్తి గొప్పది ! దానికి ప్రతిఫలంగా నేను ఏమివ్వగలను ? ఏమీ యివ్వలేను. (శిష్యుడి తల నిమిరాడు).... నువ్వు వంట పూర్తిచేసే లోపల అదిగో, ఆ కనబడుతున్న మంటపంలో కాసేపు నడుం వాలుస్తాను సరేనా ?.... హరహర మహాదేవ ! శంభోశంకర ! (ఆయాసంగా నిష్క్రమించాడు)

శిష్యుడు : (మూడురాళ్లు చేర్చి పొయ్యి చేసాడు) ఇది రాళ్ళ పొయ్యి, గురువుగారు తలచుకుంటే, యిదే బంగారం పొయ్యి అవుతుందేమో :

(తెర)

# రంగం - 2

(నేపథ్యంలో మంగళ వాయిద్యాలు వినిపించి, క్రమంగా అంతరించి పోయాయి. గురువు పద్మాసనం వేసుకొని కూర్చుని వున్నాడు. శిష్యుడు నించున్నాడు)

గురువు : వత్సా ! చిల్లి జోలెలోంచి జారిపోయిన బియ్యంలా జరజరమంటూ ఎంత కాలం గడిచి పోయింది,

శిష్యుడు : ఔను గురుదేవా !

గురువు : అయినా, కాలాన్ని మనం వృధా చెయ్యలేదు, దర్శించవలసిన క్షేత్రాలన్నీ దర్శించాము. సేవించవలసిన తీర్థాలన్నీ సేవించాము. జన్మపావనం చేసుకున్నాం. ఇక ఒక కోరిక మాత్రం మిగిలివుంది.

శిష్యుడు : ఆ కోరిక ఏమిటో అడగవచ్చా గురుదేవా ?

గురువు : కాశీ విశ్వనాధుని సన్నిధిలో శేష జీవితాన్ని గడిపేస్తే, కైవల్య ప్రాప్తి కలుగుతుందంటారు పెద్దలు. తెల్లవారగానే మనం కాశీకి ప్రయాణమవుదాం.

శిష్యుడు : గురువుగారూ !.... (మాట ఆగింది)

గురువు : ఏమినాయనా ?

శిష్యుడు : తప్పు పట్టనంటే, నా సమస్య ఒకటి విన్నవిస్తాను.

గురువు : చెప్పు బాబూ !

శిష్యుడు : చచ్చిపోయిన మాఅమ్మ ఈమధ్య తరచూ నా కలల్లోకి వస్తూవుంది. కడవలకొద్దీ కన్నీళ్లు కారుస్తున్నది. ఆమె ఆత్మ క్షోభిస్తూ వుందట. నేను పెళ్లి చేసుకొని కొడుకుని కనాలట. వాణ్ణి పెంచి పెద్దచేసి ఒక యింటి వాణ్ణి చెయ్యాలట ! మళ్ళీ వాడికి కూడా కొడుకు పుట్టాలట. వాడికి కూడా పెళ్ళి చెయ్యాలట : అప్పుడేనట మా అమ్మకు ఆత్మశాంతి.... ఇప్పుడు చెప్పండి గురుదేవా. నన్ను తమ వెంట కాశీకి రమ్మంటారా ? లేకపోతే పాపిష్టి సంసార కూపంలో పడి మా అమ్మకు ఆత్మశాంతి కలిగించమంటారా ?

గురువు : (కొంతసేపు మౌనంగా వుండి, చిరునవ్వుతో) నాతో బాటుగా గంగలో దూకమని నేను మాత్రం ఎలా చెప్పగలను ? మీ అమ్మగారికి ఆత్మశాంతి చేకూర్చటమే నీవిధి నాయనా.

శిష్యుడు : ఇది అన్యాయం గురుదేవా ! తమరుకూడా నాపుట్టి ముంచేస్తున్నారు. సంసారమంటే పిల్లకాలువనుకున్నారా ? అది మహా సముద్రం కదా ! చేత చిల్లిగవ్వలేని నేను ఆ సముద్రాన్ని ఎలా ఈదగలననుకున్నారు ?

గురువు : వెర్రి తండ్రీ ! అదా నీబెంగ ? ఇన్నాళ్లు నీచేత శుశ్రూషలు చేయించుకున్నవాణ్ణి. నిన్ను వుత్తచేతులతో పంపుతానా ! (జోలెలో చెయ్యి వేసి కొంత బంగారం తీసియిస్తూ) ఇదిగో, ఈ బంగారం తీసుకో ! దీనితో నీ జీవితం సుఖంగా గడిచిపోతుంది.

శిష్యుడు : వద్దు గురుదేవా ! నాకు ఈ బంగారం వద్దు !

గురువు : ఇంకేం కావాలి ?

శిష్యుడు : తమ శిష్యుడి కోసం తమరు చెయ్యగలిగింది చేస్తానని మాట యివ్వండి. చాలు.........

గురువు : నేను చెయ్యగలిగింది ఏదయినావుంటే, నీకోసం కాక యింకెవరి కోసం చేస్తాను ?.... ఏం చెయ్యమన్నావో చెప్పు.

శిష్యుడు : గురువుగారూ! తమరు నాకిప్పుడు నిమ్మకాయంత బంగారం యిస్తారే అనుకోండి. దాంతో ఎన్నాళ్లు గడుస్తుంది? నన్ను కట్టుకోబోయే పిల్ల దుబారామనిషి కావచ్చు. నాకు పుట్టే పిల్లలు కొండను తెచ్చిపెట్టు, కొండ మీది కోతిని తెచ్చిపెట్టు అని వేధించవచ్చు. నిమ్మకాయంత బంగారం ఏ మూలకి వస్తుంది? అందుచేత నన్ను తమరు కటాక్షించాలి. రాళ్ళను బంగారంగా మార్చే మంత్రం ఉపదేశించండి. నాకు మాట యిచ్చారు గురుదేవా! తమరు ద్రోణాచార్యులంతటివారు, శిష్యుడి కోసం ఏమైనా చేస్తారు (చేతులు జోడించాడు)

గురువు: (గుక్కిళ్ళు మింగాడు)

శిష్యుడు : అదేమిటి గురువుగారూ! ఉలుకూ పలుకూ లేకుండా అలా నోరు చప్పరిస్తున్నారు?

గురువు: అబ్బే! మరేంలేదు.... మంత్రం జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాను.

శిష్యుడు : (ఆశ్చర్యంగా) మంత్రం జ్ఞప్తికి తెచ్చుకోవటమేమిటి? రోజూ బంగారం తయారు చేస్తూనేవున్నారుగా!

గురువు: ఈ మధ్య మతి స్తిమితంగా వుండటం లేదు శిష్యా! అరవై దాటితే అరులో మరులో అని వూరకే అన్నారా?.... సరే, తెల్లవారాక కాశీకి బయలుదేరేముందు నీకు మంత్రోపదేశం చేస్తానులే! యిక పడుకుందామా?

శిష్యుడు : ధన్యోస్మి గురుదేవా! ధన్యోస్మి! ఏవీ తమ పాదాలు? నానెత్తిన పెట్టుకుంటాను.

గురువు: ఆ పనేదో తెల్లవారాక చెయ్యొచ్చులే! ఇప్పుడు నిద్ర ముంచుకొస్తూవుంది (ఆవలించాడు)

శిష్యుడు : అలాగే! నేను తమరి కాళ్ళు ఒత్తుతూ కూర్చుంటాను. తమరు హాయిగా నిద్రపోండి.

(గురువు పడుకున్నాడు. శిష్యుడు కొంత సేపు కాళ్ళు పట్టాడు. గురువు గారు గురక పెడుతున్నారు. శిష్యుడు లేచి వెళ్ళి తన పక్కమీద పడుకుని నిద్రపోయాడు)

గురువు : (లేచి కూర్చుని శిష్యుడివైపు చూశాడు) కొంపముంచాడు. మంత్రోపదేశం చెయ్యాలట, వీడి పిండాకూడు! బంగారం చెయ్యటం నాకు తెలిసి చస్తే గదా వీడికి చెప్పటానికి! తీరా యింత జరిగాక, యిప్పుడు నాకేమీ

తెలియదురా పిచ్చిసన్నాసీ అంటే వొప్పుకుంటాడా ? ఏదో అవసరానికి చిన్న అబద్ధం ఆడి, అడకత్తెరలో యిరుక్కుపోయాను. ఇప్పుడేం చెయ్యాలి ? (శిష్యుడివైపు చూచాడు. నిద్రపోతున్నాడు. మెల్లగా రెండు సార్లు చప్పట్లు చరిచాడు) మంచి నిద్రలోనే వున్నట్టున్నాడు. వీడు లేవక ముందే గంతా బొంతా సర్దుకొని చల్లగా జారుకోవడం మంచిది. (జోలె తగిలించుకున్నాడు. భుజాన కంబళివేసుకున్నాడు దండమూ కమండలమూ చేతికి తీసుకున్నాడు. నాలుగడుగులు ముందుకు వేశాడు. ఆగిపోయాడు) ఇప్పుడు పారిపోతే వీడు మళ్ళీ వెంబడించడు అన్న నమ్మకమేముంది ? పరిగెత్తుకొచ్చి పాదాలు పట్టుకుంటాడు. మళ్ళీ చిక్కులు తప్పవు. మళ్ళీ పోవటం వల్ల లాభం లేదు. ఏదో ఒక ఉపాయంతో వీణ్ణి తృప్తిపరిచి వదిలించుకోవడమే మంచిది (మళ్ళీ వెళ్ళి యథాస్థానంలో పడుకున్నాడు) హర హర మహాదేవ ! శంభో శంకర ! (నిద్రపోయాడు)

(కొంత సేపటికి కోడికూత, కాకుల అరుపులు, గుడిగంట మోత.)

శిష్యుడు : (లేచి కూర్చున్నాడు. కళ్ళు నులుముకున్నాడు.) గురువుగారూ గురువు గారూ ! లేవండి, తెల్లవారింది.

గురువు : (అదిరిపడి లేచాడు.) తెల్లవారిందా ? అప్పుడే తెల్లారిపోయిందా ? హరహర మహాదేవ ! శంభోశంకర

శిష్యుడు : గురువుగారూ ! తమరు కాశీకి యిప్పుడే బయలుదేరుతున్నారా ?

గురువు : ఏంనాయనా ? కోతిమంత్రం నేర్చుకోవాలని తొందరగావుందా ?

శిష్యుడు : కోతిమంత్రమా ? అదేమిటి గురువుగారూ !

గురువు : అదేనోయ్ బంగారం మంత్రం. కాలకృత్యాలమాట తరువాత చూసుకో వచ్చు గానీ, ఇటొచ్చి కూర్చో మంత్రం నేర్పుతా ! మంత్రోపదేశానికి ఈ వేకువపూట చాలా అనువుగా వుంది.

శిష్యుడు : (గురువుగారి ముందర మోకరిల్లి కూర్చున్నాడు.)

గురువు : ఆ దండమూ, కమండలమూ ఇలా అందుకో !

శిష్యుడు : (అందించాడు.)

గురువు : (దండాన్ని శిష్యుడినెత్తిన ఆంటించి) నేను చెప్పేది శ్రద్ధగా విను. నేను ఉపదేశించబోయేది బంగారం మంత్రమే అయినా, దాని పేరు కోతిమంత్రం. దాని పేరు ఏమి మంత్రం ?

శిష్యుడు : కోతిమంత్రం.

గురువు : దానిపేరు ఏమి మంత్రం?

శిష్యుడు : కోతిమంత్రం?

గురువు : మళ్లీ అను

శిష్యుడు : కోతిమంత్రం

గురువు : వరుసగా అంటూ వుండు

శిష్యుడు : కోతిమంత్రం.... (అని వరుసగా ఏడెనిమిదిసార్లు అన్నాడు)

గురువు : ఇక ఆపు, (శిష్యుడు ఆపాడు) ఇన్నిసార్లు ఎందుకు చెప్పుతున్నానంటే మంత్రం పేరు మరచిపోవచ్చు?

శిష్యుడు : మరిచిపోకూడదు.

గురువు : ఆ! అందుకన్నమాట! ఇక మంత్రోపదేశం చేస్తాను, పట్టు (కమండలంలో నుంచి శిష్యుడి చేతిలోకి ధార వదిలాడు.) ఏదీ, నేను చెప్పబోయే మంత్రాన్ని ఉచ్చరించు.... హేశిలే! స్వర్ణంభవ!

శిష్యుడు : హేశిలే! స్వర్ణంభవ!

గురువు : హేశిలే! స్వర్ణంభవ!

శిష్యుడు : (చెప్పాడు)

గురువు : హేశిలే స్వర్ణంభవ!

శిష్యుడు : (చెప్పాడు)

గురువు : ఈ మంత్రం పేరేమిటన్నాను?

శిష్యుడు : కోతిమంత్రం

గురువు : భళా! ఇక, నువ్వు చెయ్యవలసిందేమిటో శ్రద్ధగా విను. సరిగ్గా అర్ధరాత్రిపూట కలశం నీళ్ళు తీసుకో, ఏకాంతస్థలములో కూర్చో. చుట్టూ ఒకసారి చూసుకో! ఆ పొలిమేరల్లో ఎక్కడా కోతి కనిపించకూడదు. కోతి కనిపించటం లేదని రూఢిచేసుకున్నాక, కళ్లు మూసుకుని 'హేశిలే! స్వర్ణంభవ!' అని ఎనిమిదిసార్లు మంత్రోచ్చారణ చేస్తూ, మామిడాకుతో రాతిమీద జలాన్ని ప్రోక్షించు. కళ్లు తెరచిచూడు. రాయి బంగారమై వుంటుంది. అయితే ఒక సంగతి మాత్రం బాగా గుర్తుంచుకో. నువ్వు

మంత్రం చదివేటప్పుడు కోతిని మాత్రం తలచుకోకూడదు, గనుకనే దీన్ని కోతిమంత్రం అన్నారు. నువ్వు నా ప్రియశిష్యుడివి కనుక దీన్ని నీకు నేర్పాను. కోతిని తలచుకోకుండా వుండగలవా ?

శిష్యుడు : అదెంత పనిలెండి గురువుగారూ. కోతిని తలచుకోకుండా వుండలేనా!

గురువు : శుభం! ఇక నేను కాశీకి బయలుదేరుతున్నాను నాయనా!

శిష్యుడు : వెళ్లిరండి. (నమస్కరించాడు)

గురువు : (వెళుతూ వెనక్కిచూసి) జాగ్రత్త. కోతిని మాత్రం తలచుకోవద్దు సుమా. కోతిమంత్రం మరచిపోకు. (వెళ్లిపోయాడు)

శిష్యుడు : సంతోషంగా ఒక రాయి చేతిలోనికి తీసుకొని ముద్దుపెట్టుకొని, హేశిలే స్వర్ణంభవ.... కోతిని మాత్రం తలచుకోకూడదు.

(తెర)

# రంగం-3

(ఒకచోట చిన్న రాళ్ళకుప్ప, ప్రక్కన మామిడి ఆకువుంచినచెంబు, శిష్యుడు చేతులతో కొన్ని రాళ్ళు తెచ్చి కుప్పమీద వుంచాడు)

శిష్యుడు : (కుప్పవైపు చూసి) ఉహు! ఇది చాలా తక్కువే. ఇంకా కొన్ని రాళ్ళు తెస్తాను. దేవుడి దయవల్ల రాళ్ళకు కొదువలేదు. గురుదేవుల దీవెనవల్ల బంగారానికి కొదవలేదు. (రంగం మీదినుంచి చాటుకు వెళ్ళి, మరికొన్ని రాళ్ళు ఏరితెచ్చి కుప్పలా వేశాడు). ఈ బంగారంతో రాజభవనంలాంటి మేడ కట్టిస్తాను. వస్తువాహనాలు కొంటాను. నౌకర్లనూ, చాకర్లనూ పెట్టుకుంటాను. నా వైభవం చూసి రాజ్యంలో ధనవంతులంతా నన్ను గౌరవిస్తారు. వాళ్ళను విందుకు పిలుస్తాను. వాళ్లు వచ్చినప్పుడు బంగారు పళ్ళాలలో కదా వడ్డనచెయ్యాలి. (రాళ్ళవైపు చూశాడు ఉహూ! ఈ రాళ్లు చాలవు. మరోవైపు వెళ్ళి మరికొన్ని రాళ్లు తెచ్చి కుప్పలో వేశాడు.)

కోటీశ్వరులంతా వెళ్లి నా వైభవం గురించి రాజుగారితో చెబుతారు. రాకుమారి నన్నే చేసుకుంటానని మొరాయిస్తుంది. కూతురి ముచ్చట చెల్లించకపోతే వాడేం రాజు. రాజు నా దగ్గరకు వచ్చి బతిమాలుకుంటాడు రాజుగారు వచ్చి అడిగినప్పుడు సరే అనక తప్పుతుందా ? రాకుమారికీ నాకు పెళ్లి జరిగిపోతుంది. దేవతలంతా పుష్పవర్షం కురిపిస్తారు.... ఔనూ, పెళ్లికూతురికి మోపెడు నగలు చేయించకపోతే నా పరువేముంటుంది. (కుప్పవైపు చూశాడు. ఉహు రాళ్లు చాలవు. మరికొన్ని తెస్తాను. మళ్లీ వెళ్లి కొన్ని రాళ్లు తెచ్చి కుప్పలో వేస్తాడు.)

ఇప్పటికి ఈ బంగారం చాల్లే చేతిలో వున్న విద్యే కదా? అను కున్నప్పుడల్లా తయారు చేసుకోవచ్చు. ఇక కోతిమంత్రం జపించి రాళ్లను బంగారంగా మారుస్తాను. వెళ్లి రాళ్ళదగ్గర కూర్చున్నాడు.

(గురువుగారి మాటలు స్మరణకు వస్తున్నాయి నేపథ్యంలోంచి 'నువ్వు మంత్రం చదివేటప్పుడు కోతిని మాత్రం తలచుకోకూడదు' అనే వాక్యం వరుసగా మళ్ళీ మళ్ళీ వినిపిస్తూనేవుంది)

శిష్యుడు : (చెవులు మూసుకొని) సరే! కోతిని తలచుకోను. (చెంబు చేతికి తీసు కున్నాడు)

(గురువుగారి మాటలు: చుట్టూ ఒకసారి చూసుకో! ఎక్కడా కోతి కనిపించగూడదు)

శిష్యుడు : (చుట్టూ ఒకసారి చూశాడు. లేదు, ఎక్కడగానీ కోతి కనిపించడంలేదు. ఇక కోతిమంత్రం జపిస్తాను. కాళ్ళమీద నీళ్ళు చిలకరిస్తూ) హేశిలే స్వర్ణంభవ!.... హేశిలే! స్వర్ణంభవ.

(నేపథ్యంలో గురుశిష్యుల సంభాషణ)

(దానిపేరు ఏమిమంత్రం?.... కోతిమంత్రం... మళ్ళీఅను... కోతిమంత్రం... వరుసగా అంటూవుండు.)

కోతిమంత్రం... కోతిమంత్రం... కోతిమంత్రం... కోతిమంత్రం...

శిష్యుడు : హేశిలే! స్వర్ణంభవ!.... హేశిలే! స్వర్ణంభవ!

(గురువుగారి మాటలు: జాగ్రత్త కోతినిమాత్రం తలచుకోవద్దుసుమా! కోతిమంత్రం మరచిపోకు)

శిష్యుడు : హేశిలే! స్వర్ణంభవ!.... హేశిలే స్వర్ణంభవ.

(గురువుగారి మాటలు: నువ్వు మంత్రం చదివేటప్పుడు కోతిని మాత్రం తలచుకోకూడదు. అలా తలచుకుంటే రాయి బంగారం కాదు.)

శిష్యుడు : హేశిలే! స్వర్ణంభవ!.... హేశిలే స్వర్ణంభవ (కళ్ళుతెరచి ఆత్రుతగా రాళ్ళ మీదికి తొంగిచూశాడు). ఛీ పాడుకోతి! కాస్సేపు జ్ఞప్తికి రాకుండా వుండదు కదా. రాళ్ళు రాళ్ళుగానే వున్నాయి.... (కళ్ళు మూసుకున్నాడు. నీళ్ళు చిలక రిస్తూ) హేశిలే! స్వర్ణంభవ! హేశిలే! స్వర్ణంభవ! కోతిన్నరకోతి కోతి, హేశిలే! స్వర్ణంభవ! దీన్ని పాతెయ్య!.... హేశిలే: స్వర్ణంభవ! (పళ్లు నూరుతూ) దీన్ని ముక్కలు ముక్కలుగా నరికి పోగులు పెట్టాలి.... హేశిలే: హేశిలే! స్వర్ణంభవ! (నెత్తిన మొట్టికాయ వేసుకొన్నాడు) హేశిలే! స్వర్ణంభవ! (గట్టిగా నెత్తి బాదుకున్నాడు)....

(తెర)

# రంగం-4

(గురువుగారు దారివెంట నడుస్తూ ఆయాసంగా)

గురువు : హరహర మహాదేవ : శంభోశంకర ! శిష్యుడు వెంటలేకపోవటం కాస్త యిబ్బందిగానే వుంది. అయినా చేసేదేముంది. బంగారంమీది వ్యామోహంతో వాడు నాకు దూరమైపోయాడు. వాణ్ణి వొదిలించుకొని వచ్చి ఇవ్వాళిటికి వారం రోజులైంది. వాడు రాళ్ళు ముందేసుకుని కోతిని తలచుకుంటూ వుంటాడు. ఉపాయంగా వాడిమీదే నెపం వేసి వచ్చేశాను. ఇక వాడు నావెంట పడడు. వాడి దారి వాడిది. నాదారి నాది. (కూర్చున్నాడు.)

శిష్యుడు : (గొంతు) గురువర్యా ! గురువర్యా !

గురువు : (ఉలికిపడిలేచాడు. దూరానికేసి చూస్తూ) ఎవరిదీ ? వాడేనా? చచ్చానుపో ! ఆ పరుగెత్తుకొస్తున్నవాడు శిష్యుడే ! మళ్ళీ వెంటబడుతున్నాడేమిటీ ? తొందరగా రంగం మీదినుంచి నిష్క్రమించాడు)

శిష్యుడు : (రెండోవైపు నుంచి పరుగు పరుగున వచ్చాడు) గురువర్యా ! ఆగండి ఆగండి గురువర్యా !

(గురువు వెళ్లినవైపే పరుగుతీశాడు. గురువు మళ్ళీ రంగంమీదికి పరుగుతీశాడు. తరువాత వెంటబడుతూ శిష్యుడు కూడా పరుగుతీశాడు. మూడోసారి గురువు వెను దిరిగిచూస్తూ రంగంమీదికి వచ్చాడు. శిష్యుడు ఈసారి ఎదుటివైపు నుంచి వచ్చి తారసపడ్డాడు)

శిష్యుడు : గురువర్యా !

గురువు : (అదిరిపడి) ఏమిటిది ? మళ్ళీ ఎందుకొచ్చావు ?

శిష్యుడు : కాశీకి వెళ్ళినవాడూ, కాటికి వెళ్ళినవాడూ ఒకటేనన్నారు. తమరు బతికుండగానే వెతికిపట్టుకోవడం నా అదృష్టం గురుదేవా !

గురువు : వత్సా ! నన్ను విసిగించకు ! నాదారికి అడ్డురాకు (ముందుకు వెళ్ళబోయాడు) నీ గొంతెమ్మ కోరికలు తీర్చడం నాతరంకాదు బాబు ! నన్ను పోనియ్యి.

శిష్యుడు : గొంతెమ్మ కోరికకాదు మహాత్మా , ఆవగింజంత కోరికే. తమవల్ల సాధ్యమయ్యేది.

(చుట్టూచూచాడు. రంగంమీదినుంచి గబగబా పార్శ్వంలోకి వెళ్ళాడు. మోయగలిగినంత పెద్దబండరాయి ఒకటి తెచ్చి గురువుగారి ముందర పెట్టాడు)

శిష్యుడు : ఈ రాతిని బంగారంగా మార్చేయండి, పట్టుకెళ్ళిపోతాను.

గురువు : ఆ పనేదో నువ్వే చూసుకోరాదూ ? మంత్రం నేర్పానుకదా.

శిష్యుడు : మంత్రం నేర్పాను సరే, కానీ మనస్సుని నిలకడగా వుంచుకోలేక పోతున్నాను. వరసగా మూడు రాత్రులు మంత్రం జపించినా, బంగారం తయారుకాలేదు. కోతి జ్ఞప్తికిరాని క్షణమే లేదు. ఏకాగ్రత లేని నాకు తమరు నేర్పిన మంత్రం ఎందుకూ పనికిరాదు.

గురువు : వత్సా? కోతి ఒకచోట కుదురుగా వుండటం ఎప్పుడైనా చూశావా? మనస్సు కూడా కోతిలాంటిది. మనస్సును నిలకడగా పెట్టుకోవటం ఎవరి తరమూకాదు నాయనా! నీకు పనికిరాని మంత్రం నాకు కూడా పనికిరాదు.

శిష్యుడు : అబద్ధం చెప్పకండి గురువుగారూ! చాలాసార్లు తమరు బంగారం తయారు చేశారు కదూ?

గురువు : అదేనాయనా, నేను చెప్పిన అబద్ధం! రాళ్ళను బంగారంగా మార్చటం నాకు చేతకాదు. నాదగ్గర కొంత బంగారం వుంది. ఆ సంగతి నీకు తెలిస్తే దురాలోచనకు పాల్పడతావేమోనని, అబద్ధమాడాను. నీకు నేర్పిన మంత్రం వుత్తదే. రాయీ, బంగారంగా మారిపో అంటే ఎలా మారిపోతుంది.

శిష్యుడు : గురువుగారూ నన్ను తమరు మోసం చేశారు. ఘోరంగా మోసం చేశారు. (బావురుమంటూ ఏడ్చాడు)

గురువు : (శిష్యుడి వీపు నిమురుతూ) నాయనా! శాంతించు అత్యాశలకు పోతే, ఎదురయ్యేది ఆశాభంగమే. ఎప్పటికీ అందని స్వర్గం కంటే ఇప్పుడు చేతి కందే ఉట్టి మేలు.

శిష్యుడు : (చేతులు జోడించి) గురువుగారూ తప్పుపట్టనంటే. ఒక పెద్దకోరిక కోరుతాను. తమరు తీర్చగలిగేదే.

గురువు : అప్పుడు నేనివ్వబోతే వద్దన్నావే, ఆ బంగారమే కదా?

శిష్యుడు : చిత్తం! అదే! అదే చాలు.

గురువు : (జోలెతో చెయ్యివేసి, బంగారం తీసి) తీసికో! (శిష్యుడికి యిచ్చాడు) తృప్తిగా జీవించు (ఆశీర్వదించాడు)

శిష్యుడు : (గురువుగారికి సాష్టాంగ ప్రణామం చేశాడు)

# చేత వెన్న ముద్ద




పాత్రలు :

| | | |
|---|---|---|
| 1. | శారద (అక్క) | వయసు 12 సం॥ |
| 2. | రాధ (చెల్లెలు) | ,, 7 సం॥ |
| 3. | తల్లి | ,, 35 సం॥ |
| 4. | పుల్లమ్మ (పొరిగింటి యిల్లాలు) | ,, 40 సం॥ |
| 5. | విమల (శారద స్నేహితురాలు) | ,, 12 సం॥ |
| 6. | లలిత ,, ,, | ,, 12 సం॥ |
| 7. | సరోజ ,, ,, | ,, 12 సం॥ |
| 8. | చిన్ని కృష్ణుడు (సరోజ చెల్లెలు - కృష్ణ వేషంలో వస్తుంది) | |

(ఇంటి వసారా. వసారాకు వెనుకభాగంలో ఎడమవైపున లోపలకు వెళ్లేంధుకు ఒక వాకిలి ఉంది. వసారాలో మూడు కుర్చీలు, ఒక చిన్న టేబిలు ఉన్నాయి శారద టేబిల్ వెనుకనున్న కుర్చీలో కూర్చొని చదువుకుంటున్నది:)

శారద : ఎడ్డె మనుష్యు డే మెఱుగు నెన్ని దినంబులు గూడియుండి నందొడ్డ గుణాఢ్యునందు గల దొరపువర్తనలెల్ల బ్రజ్ఞ పేర్పడ్డ వివేకి రీతి.....

తల్లి : (లోపల్నుంచి) శారదా ! శారదా !

శారద : ఆఁ

తల్లి : (లోపల్నుంచి) ఈ రాధ నలా పిలువమ్మా! ఇక్కడ గోలచేస్తోంది. (రాధతో) పోవే! అక్కదగ్గర కూర్చుని చదువుకో పో! నువ్వుకూడ.

శారద : రాధా! ఇలా రావే! నీకో మంచి మాట చెప్తాను.

రాధ : (లోపల్నుంచి) నేను రానుపో!

(రాధను తీసుకొని తల్లి వసారాలోకి వచ్చింది)

తల్లి : (రాధను శారదదగ్గర వదలివెడుతూ) మా తల్లివిగా! అక్కదగ్గఱ కూర్చొని కాసేపు చదువుకో! నా కవతల పనిలేదూ మరి?

శారద : (తల్లితో వెళ్ళబోతున్న రాధను చేయి పట్టుకొని తీసికొనివచ్చి) రాధా! నీ కో మంచి మాట చెప్పనా!

రాధ : ఏమిటమ్మా అది?

శారద : చెపుతానుండు

రాధ : చెప్పు

శారద : చెపుతాగాని ముందు కళ్లు మూసుకో!

రాధ : ఊఁ (కళ్లుమూసుకుంది)

శారద : నోరు తెరువు

రాధ : ఆఁ (నోరు తెరచింది)

(శారద, పిప్పరమెంటు రాధ నోట్లో వేస్తుంది)

రాధ : (పిప్పరమెంటు ఉమ్మేస్తూ) పాడు పిప్పరమెఁటు. ఆ, నాకేమి వద్దు పో! మాట చెప్తానని పిలుచుకొచ్చి....

శారద : మరి చెప్తాగాని - వింటావా?

రాధ : ఓ!

శారద : ఊరికే వింటంగాదు - నేను చెప్పినట్లు చెయ్యాలి

రాధ : ఓ చేస్తాగా

శారద : అయితే ఇక్కణ్ణుంచి లే!

రాధ : ఊఁ (లేచింది)

శారద : ఇంట్లోకి పో - పలకా పుస్తకాలు తీసుకురా !

రాధ : ఇదేనమ్మా మాట ?

శారద : తీసుకురా ! చెప్తాగా !

రాధ : లోపలకు వెళ్లి పలకా పుస్తకాలు తీసుకొని వచ్చింది. ఇదిగో :

శారద : ఊఁ నీకివ్వాల్టి పాఠంవచ్చిందా ?

రాధ : ఎప్పుడో వచ్చేసింది.

శారద : ఎక్కాలో ?

రాధ : ఆఁ!

శారద : నీ కెన్ని ఎక్కాలొచ్చునే ?

రాధ : తొమ్మిది.... కాదు కాదు పదికూడా వచ్చు,

శారద : అంతా వట్టిదే.... అబద్ధం....

రాధ : ఆ.... అప్పచెప్తా - చూడు, పది ఒకట్ల పది.... పది రెండ్లిరవై.... పది మూళ్ల ముప్పై.... పది నాలుగులు నలభై.... పదైదులు....

శారద : చాల్ చాలు. పదో ఎక్కం అప్పజెప్పటంకూడా ఒక గొప్పేనేమిటి ? తొమ్మిదో ఎక్కం అప్పజెప్పుచూద్దాం !

రాధ : తొమ్మిదా ?

శారద : ఊఁ

రాధ : అంటే.... తొమ్మిదొకట్ల తొమ్మిది.... అదా ?

శారద : ఆ అదే !

రాధ : అదేనా ?.... అయితే నే నది అప్పజెప్పను.

శారద : ఏం ? రాధా ?

రాధ : వచ్చు నే నప్పజెప్పను.

శారద : ఎందుకని ?

రాధ : నాయిష్టం.... మరే, అయిదో ఎక్కం అప్పజెప్పనా,

శారద : ఊఁ చెప్పు.

రాధ : అయిదొకట్ల అయిదు.... అయిదు రెండ్లు పది.... అయిదు మూళ్ల పది హేను.... అయిదు నాలుగు లిరవై.... అయిదైదులు ఇరవైయ్యయిదు అయిదా ర్లిరవై అయిదు.

శారద : తప్పు ! తప్పు ! అయిదార్లెంత ?

రాధ : (ధీమాగా) ఇరవై అయిదు.

శారద : కాదు.

రాధ : అంతే !

శారద : శుద్ధ తప్పు - నీకసలు ఎక్కాలు రావు.

రాధ : (గారాబంగా) ఊ వచ్చు....

శారద : వస్తే తప్పులు చెప్తావేం ? అయిదార్లిరవై అయిదా ?

రాధ : ఊ

శారద : అయితే అయిదైదు లెంత ?

రాధ : ఇరవై అయిదు.

శారద : అయిదైదులు - అయిదార్లుకూడ ఇరవై అయిదే ఎలా అవుతాయే ?

రాధ : బాగానే అవుతయ్ !!

శారద : కాదే మొద్దు - అయిదార్లు ముప్పై !

రాధ : కాదు ఇరవై అయిదే !!

శారద : (విసుగ్గా) ముప్పయే !

రాధ : (ఏడుపు ముఖంతో) ఇరవై అయిదు....

శారద : అబబ్బబ్బ కాదే (విసుగు, కోపం)

రాధ : (ఏడుస్తూ) అమ్మో ! అయిదార్లు ఇరవై అయిదేనే !

శారద : (రాధను గడ్డం పట్టుకొని సముదాయిస్తూ) ఊ ఊ ఇరవై అయిదేలే.... ఏడవబోకు.... మాతల్లివిగా.... ఇంక ఎక్కాలొద్దులే.... మరో పిప్పర మెంటు పెట్టనా ?

రాధ : నాకేమీ వద్దు పో !

శారద : అయితే పాఠం చదువుకో.

రాధ : నేను చదవను

శారద : పోనీలే - మెదలకుండా కూర్చో ! నేను చదువుకోవాలి రేపు పరీక్షలుకూడ.

రాధ : (మెదలకుండా కూర్చుంటుంది)

శారద : (పుస్తకం తెరిచి చదువుకుంటున్నది) ఎడ్డె మనుష్యు డే మెఱుగు నెన్ని దినంబులు గూడియుండినన్ దొడ్డ గుణాఢ్యునందుగల దొరపు వర్తనలెల్ల బ్రజ్ఞపేర్పడ వివేకి రీతి....

రాధ : (నెమ్మదిగా) అక్కా....

శారద : (చదువుకుంటూనే రాధవేపు చూస్తుంది)

రాధ : నీవు చదివే దేమిటి ?

శారద : పద్యం (మళ్ళీ చదువుకుంటుంది)

రాధ : అయితే నేను కూడా పద్యం చదువుకోనా ?

శారద : ఊఁ

రాధ : నాకు పద్యాలు రావుగా మరి ?

శారద : అబ్బ ! రాకపోతే పుస్తకంలో చూచి చదువుకోవే. (లోలోపల తన పద్యం చదువుకుంటుంది. అంటే మాట వినపడదుగాని పెదవుల కదలిక కనబడుతుంది.)

రాధ : మా పంతులుగారు మాకు ఒక పద్యమే చెప్పారు. అది చదువుకోనా ?

శారద : అబ్బ ! నన్ను విసిగించకు. నన్ను చదువుకోనియ్. మా పరీక్షలుగూడ రేపే.

(శారద తన పద్యం చదువుకుంటుంది.)

రాధ : (పుస్తకం తెరచి బిగ్గరగ) చే....త....చేత....వె....న్న....నాకు నా వత్తిస్తే (కాసేపు ఆలోచిస్తూ పైకి చూస్తుంది.)

శారద : (కొంచెం పైకి వినబడేటట్లు చదువుకుంటూనే రాధవైపు కోపంగా చూస్తుంది.)

రాధ : (అక్కవైపు తిరిగి) అక్కా ! 'నా' కి నా వత్తిస్తే ఏమౌతుంది ?

శారద : (విసుగుతో) నా తలకాయౌతుంది.

రాధ : (చదువుతూ) 'నా'కు నావత్తిస్తే నా తలకాయ (ఆగి) తలకాయ ఎలా గౌతుందక్కా ?

శారద : (పక పకా నవ్వుతూ) అలాగే అవుతుందిలే. మరింతేనా ? నీకు తెలిసింది ?

రాధ : కాదక్కా, నాకు 'నా' వత్తిస్తే....'న' అవుతుందికాదూ ?

శారద : ఊఁ ఇంక నన్ను కదిలించకు. (లోలోపల చదువుకుంటుంది)

రాధ : చేత వెన్న ము....'ద'....ద కింద 'ద' వత్తిస్తే 'ద్ద' ముద్ద, వెన్న ముద్ద (ఆగి అక్కవైపు చూస్తూ) అక్కా !

శారద : నన్ను మాట్లాడిస్తే ఇంక కొడ్తానమ్మాయి !

రాధ : ఈఁ ఒక్కటి చెప్పక్కా....ఇంక అడగను.

శారద : ఊఁ అడుగు

రాధ : రేపు నీకు పరీక్షలా ?

శారద : ఉ ఇందాకట్నుంచీ చెప్పటంలా ?

రాధ : అదికాదక్కా. పరీక్షలంటే ఏంచేస్తారు ?

శారద : పరీక్ష చేస్తారే !

రాధ : అంటే

శారద : అంటే (ఆగిపోయి - ఆలోచించి) అ.... ప్రశ్నలడుగుతారు.

రాధ : అంటే

శారద : (విసుగుతో) ఇప్పుడు నువ్వడగటంలా ? అట్లాగే

రాధ : (కాసేపు ఆలోచించి) అయితే ఇప్పుడు నీకు పరీక్షలు ఐపోయినట్లేనా ? అక్కా ?

శారద : (నవ్వుతూ) ప్రశ్నలంటే ఇవి కావే ? పుస్తకాల్లోవి అడుగుతారు. పాఠాల మీద.

రాధ : ఒహో అదా ? పాఠం అప్పజెప్పటమా ? అయితే మాకు రోజూ పరీక్షలే నక్కా

శారద : ఇంతకూ నన్ను చదువుకోనిస్తావా ? లేదా ?

రాధ : చదువుకో అక్కా ! నేనేం చేశాను ? (పుస్తకం తెరిచి, చూస్తూ బిగ్గరగా) 'చె'కి సున్నా బెడితే 'చెం'.... 'గ'. 'ల' 'కి' 'వ' వత్తిస్తే - 'ల్వ' - చెంగల్వ.... (ఆగి) అక్కా !

శారద : (లోలోపల చదువుకుంటూనే - కోపంగా రాధవంక చూస్తుంది)

రాధ : మీ పరీక్షలప్పుడు మీ పంతులుగారు బెత్తంకూడా తీసుకొస్తారా ?

శారద : (ఓర్పుపోయి - పెద్దగా) ఎడ్డె మనుష్య దే మెఱుగు నెన్ని దినంబులు కూడియుండినం...పాడు పద్యం ఎంతకీ రాదు... (మళ్ళీ చదువుకుంటుంది)

రాధ : (అంతకంటె పెద్దగొంతుతో) చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ 'బ'కి సున్నా 'బం' బం.... బం.... బం....

శారద : నెమ్మదిగా చదువుకోవాలే

రాధ : నీవు అరవటం లేదమ్మా !

శారద : (గొంతు తగ్గించి) ఎడ్డె మనుష్యుడు - మూర్ఖుడు: ఎన్ని దినంబులు - ఎన్ని రోజులు : కూడియుండినన్ - కలసి మెలసి యుండినను.

రాధ : చేత - చేత : వెన్నముద్ద వెన్నముద్ద: చెంగల్వ - చెంగల్వ : పూలదండ అంతేనా అక్కా ?

శారద : అబ్బబ్బ ! నువ్విక్కణ్ణుంచి పోవే అసలు.

రాధ : ఊఁ - నేను పోను

శారద : అమ్మా ! ఇది నన్ను చదువుకోనివ్వటంలేదే - గోల చేస్తోంది

తల్లి : (లోపల్నుంచి) ఏమే రాధా ?

రాధ : కాదమ్మా పద్యం చదువుకుంటున్నానమ్మా !

శారద : అమ్మా ! దీన్ని పిల్చుకెళ్లవే !

రాధ : అమ్మా ! దీన్నే పిల్చుకెళ్లవే !

శారద : నోర్మయ్ - చెంప పగలగొడ్తాను

రాధ : (ఏడుపు మొదలుపెడ్తుంది)

తల్లి : (వసారాలోకి వస్తూ) అబ్బబ్బ ! ఏమిటే గోల !

రాధ : అక్క కొడుతుందటే !

శారద : చూడవే ఇక్కడ నన్ను చదువుకోనివ్వకుండా అల్లరి చేస్తోంది.

తల్లి : చిన్న పిల్లలను కూడ కాసేపు సముదాయించుకోలేకపోతే ఎలా అమ్మా! నాకవతల చెయ్యి తీరికలేకుండా ఉందిగదా (రాధతో) అల్లరిచెయ్యకుండా చదువుకోమ్మా !

రాధ : చదువుకుంటున్నానమ్మా ! చేత వెన్నముద్ద లేదూ ?.... అది

తల్లి : మా బంగారుకొండవుగా ! చదువుకోమ్మా (శారదతో) ఏమీ అల్లరి చెయ్యదులేవే - కూర్చోనియ్ (లోపలకు వెళ్తుంది)

శారద : (మళ్ళీ చదువు ప్రారంభించింది) ఎడ్డె మనుష్యుడు - మూర్ఖుడు, ఎన్ని దినంబులు - ఎన్ని రోజులు, కూడియుండినన్ - కలసి మెలసి యుండినను దొడ్డగుణాఢ్యునందు - మంచి గుణములచేత గొప్పవాడగు వానియందు కల - ఉన్న, తోరపు వర్తనలు - గొప్పగుణములు....

రాధ : చేత - చేత వెన్నముద్ద-వెన్నముద్ద (ఆగి ఆలోచించి, చాలా నెమ్మదిగా) అక్కా !

శారద : (నవ్వాపుకుంటూ, రాధవంక చూచి, మెదలకుండా ఊరుకుంటుంది.)

రాధ : (అక్కదగ్గరకు జరిగి, చెవిలో) అక్కా !

శారద : (పలుకదు)

రాధ : (కాసేపు అక్కవైపు చూచి కొంచెం పెద్దగా) అక్కా !

శారద : (పలుకదు)

రాధ : (ఉహూ....హుం....దగ్గింది.)

శారద : (పలుకదు)

రాధ : చేత వెన్నముద్ద, చెంగల్వపూదండ....'బ' కి సున్నా పెడితే 'బం'.... 'బం'....'బం'....

శారద : (పలుకదు)

రాధ : (అక్క కుర్చీ ఎక్కి - అక్కచెవిలో - బిగ్గరగా) బం - బం - బం - బం

శారద : (నవ్వాపుకోలేక పకపక నవ్వుతూ) ఇంత అల్లరి పిల్లవయితే ఎలాగే ! (రాధను ఒడిలోకి తీసుకుంది)

రాధ : కాదక్కా ! వెన్నముద్దంటే ఏమిటా ? అని

శారద : వెన్నముద్ద తెలీదుటే. ప్రొద్దున అమ్మకొన్నది

రాధ : అమ్మ ప్రొద్దున వెన్నముద్ద కొన్నదా ?

శారద : ఊఁ

రాధ : ఇదివరకుకూడా ఎప్పుడన్నా కొన్నదా ?

శారద : వారానికోసారి కొంటూనే ఉంటుందే!

రాధ : నీ వెప్పుడన్నా తిన్నావా?

శారద : లేదే - ఎప్పుడన్నా తింటే తినుండొచ్చు.

రాధ : మరి నేనో?

శారద : నువ్వు తిన్నదీ లేనిదీ నాకేం తెలునే?

రాధ : ఈ మాత్రం తెలీదక్కా! నేనెప్పుడూ తినలా! నువ్వు అమ్మాకలిసి అంతా తినేస్తున్నారు కాబోలు! పోన్లే నాకు పెట్టకపోతేమాన్లే (మూతి బిగించింది)

శారద : మేముకూడా తినలేదే! అది కరగబెట్టి నెయ్యి చేస్తారు

రాధ : (బ్రతిమాలుతూ) అక్కా.... అక్కా! నాక్కాస్త వెన్న పెట్టిస్తావ్?

శారద : పోవే! ఇలా అల్లరి చేస్తుంటే ఎవరు పెట్టిస్తారు?

రాధ : అల్లరి చెయ్యనుగా

శారద : మరి నేను చెప్పినట్లు వింటావా?

రాధ : ఓ

శారద : (వేలితో చివరగా ఉన్న కుర్చీ చూపిస్తూ) అటువెళ్ళు

రాధ : (వెళ్ళింది)

శారద : కుర్చీ మీద బాసిపట్లు వేసుక్కూర్చో, చేతులు కట్టుకో, కళ్లు మూసుకో, మాట్లాడ కూడదు.

(శారద ఒకటొకటిగా చెప్తుంటే రాధ అలాగే చేసింది)

శారద : (లోలోపల చదువుకుంటుంది)

రాధ : వెన్నపూసేది?

శారద : అదిగో - మాట్లాడుతున్నావ్.

రాధ : మరెంత సేపమ్మా ఇట్లా?

శారద : వెన్నపూస పెట్టేంత వరకూ?

రాధ : మరి త్వరగా పెట్టు

శారద : నీవు కదలకుండా కూర్చో

రాధ : (కదలకుండా, మౌనంగా కూర్చుంది)

(ప్రవేశం - పొరుగింటి పుల్లమ్మ)

పుల్లమ్మ : కమలమ్మ వదినా ! కమలమ్మ వదినా ! (లోపలికి వచ్చింది) లేదుటే అమ్మాయ్ అమ్మ ఇంట్లో ?

శారద : ఉన్నదత్తయ్యా ? పిలువనా ?

పుల్లమ్మ : పిలువమ్మా ! (రాధనుచూచి) అదెవరే ? అది ? రాధా ?

శారద : ఆఁ

పుల్లమ్మ : ఎందుకలా కూర్చుంది హఠయోగం పట్టినట్లు ?

శారద : ఎందుకో కనుక్కో - అత్తయ్యా ?

పుల్లమ్మ : ఏమే అమ్మాయ్ ఎందుకలా కూర్చున్నావ్ ?

రాధ : (మాట్లాడదు)

పుల్లమ్మ : ఇదేమిటే తల్లీ ? పిలిచినా పలుకవ్ ?

శారద : ఏమిటత్తయ్యా మాటగూడ పడిపోయిందా ?

పుల్లమ్మ : చాల్లేవే - వేళాకోళం - మీ అమ్మను పిలువు - వెళ్తాను.

శారద : (రాధను కదుపుతూ) కదిలించినా కదలటం లేదత్తయ్యా ? బిఱ్ఱబిగుసుకు పోతోంది. ఇదేమిటోమరి !

పుల్లమ్మ : (దగ్గరకు వచ్చి పట్టుకొని చూచి) అవునేవ్ ! ఇదేమిటీ ఖర్మం ? పిలువ్! పిలువ్ ! అమ్మను త్వరగా పిలువ్ !

శారద : (నవ్వాపుకుంటూ. లోపలకు వెళ్ళింది)

(ప్రవేశం - తల్లి)

పుల్లమ్మ : అయ్యో ! అయ్యో ! ఇదెక్కడి ఖర్మమే తల్లీ ! నీ కెంత కష్టం వచ్చిందే అమ్మా !

తల్లి : ఏమిటమ్మా వదినా ! ఏమిటి ?

పుల్లమ్మ : ఏమిటంటావేవమ్మా ? ఆ ఏడుకొండలవాడో ! మంగళగిరి పానకాల స్వామో, బెజవాడ కనకదుర్గమ్మో ఎవరి కే మపచారం జరిగిందో ! మొక్కులు మరువలేదుకదా ?

తల్లి : నాకేం మ్రొక్కులున్నాయమ్మా ! నాకే మ్రొక్కులూ లేవు

పుల్లమ్మ : మరి పిల్లదట్లా ఎందుకైందే అమ్మా ! అదేమన్నా జబ్బా ?

తల్లి : ఏ పిల్ల ?

పుల్లమ్మ : అయ్యో రాత ! మీ రాధను చూడవమ్మా ?

తల్లి : రాధకేమి ? ఇప్పుడాడుకుంటూనే ఉండెగా ? (రాధను సమీపించి) అమ్మాయ్ రాధా !

రాధ : (పలుకదు)

తల్లి (రాధను కదుపుతూ) రాధా ! రాధా !

రాధ : (కదలదు, పలకదు)

తల్లి : ఇదేమిటే అమ్మా ! కదలవు ! పలకవు !

పుల్లమ్మ : అదిగాదుటే తల్లీ ! నేను మొత్తుకొనేది

తల్లి : శారద ! ఏమిటే ఇది ?

శారద : ఏమో ! నాకేం తెలుసు ! గట్టిగా కదిలించు; లేకపోతే ఒకటి అంటించు ఆదే పలుకుతుంది.

రాధ : అలాఅయితే నేను ఒప్పుకొంటానేమిటి ?

తల్లి : ఒప్పుకోట మేమిటే ?

రాధ : కొడితే ఎవరొప్పుకుంటారేం ? నే నొప్పుకోను ఫో

పుల్లమ్మ : ఓసి నీ పిల్ల బంగారంగాను ? ఎంత బంగారు పెట్టావే తల్లీ !

తల్లి : ఒప్పుకొనేదేమిటే ?

రాధ : కదలకుండా కూర్చోమంటే ఒప్పుకున్నానుగాని కొడతానంటే ఒప్పుకుంటానేమిటి ?

తల్లి : కదలకుండా కూర్చోటమెందుకే ?

రాధ : అక్క వెన్నముద్ద పెడతానన్నదిగా ?

తల్లి : అబ్బబ్బ ! ఏంపనులే శారదా ఇవి ? రాను రాను మరీ చిన్నపిల్లవై పోతున్నావ్ ? చూచావుటమ్మా పుల్లమ్మ వదినా ! ఇదీ వరుస ఈ పిల్లతో

పుల్లమ్మ : నీ పిల్లలకేమమ్మా ! బంగారు కొండలు

తల్లి : ఆ ! కొండలే ! ఒట్టి మొండిఘటాలు ? అంతా మేనత్తల చాలే.

పుల్లమ్మ : యేమమ్మోమ్ ! మా జోలెత్తుతున్నావు ! వీళ్ళదంతా అమ్మపోలికే

రాధ : అమ్మా ! నాకు వెన్నపెట్టవ్ ?

తల్లి : ఏదీ వెన్న ?

రాధ : ప్రొద్దున కొన్నావుటగా - అమ్మా

తల్లి : ఎవరన్నారు ?

రాధ : అక్క చెప్పిందిలే !

తల్లి : చెప్పిందీ అక్కా

రాధ : ఆ ! చెప్పింది....ఏమమ్మా....వెన్న పెట్టవ్ ?

తల్లి : లేదమ్మా అది కరగేశాను.

పుల్లమ్మ : ఎంత కొన్నావమ్మా వదినా - వెన్న ?

తల్లి : ఎంతో ఎక్కడిది ? అరవీశడే

పుల్లమ్మ : కరగేస్తే ఎంతైందేమిటి, - ఒక సోలెడైందా ?

తల్లి : ఏమో ! ఆ కొలిచే అలవాట్లు నాకు లేవు.

పుల్లమ్మ : కొలవకపోతేనేంలే ! అవుతుందిలే-ఒక సోలెడవుతుంది. ఇదిగో కమలమ్మ వదినా ! ఒక చిన్నగిన్నెడు-

తల్లి : ఏమిటి ?

పుల్లమ్మ : నెయ్యి ! రెపొద్దునే మళ్ళా ఇచ్చేస్తాను.

తల్లి : అబ్బే ! లేదమ్మా !

పుల్లమ్మ : ఎగవేసి పోనులేవమ్మా- రేపు మీ అన్నయ్య తెస్తానన్నారు - తప్పకుండా ఇస్తాను.

తల్లి : ఉంటే నీ కభ్యంతర మేముందీ ? లేదు

పుల్లమ్మ : లేదంటావేమమ్మా ? ఇప్పుడేగా వెన్న కరగేశానన్నావు.

తల్లి : ఓ ! అదా ? పిల్ల ఏడిపిస్తుందని అలా అన్నానమ్మా ! కరగెయ్యలేదు - ఏమీ లేదు.

పుల్లమ్మ : అయితే నాకు వెన్న పెట్టు.

తల్లి : అబ్బే ! లేదమ్మ ! కరగేశాను.

పుల్లమ్మ : నీకు పుణ్యముంటుంది. ఒక్క గిన్నె డివ్వవమ్మా ! చుట్టం వచ్చాడు.

తల్లి : ఉంటే నీకు లేదంటానా ? ఇదివఅకు ఉన్నప్పుడివ్వలా ?

పుల్లమ్మ : మాట దక్కిస్తావనేగా నిన్నడిగింది. మరొకళ్లనైతే గొంతులో ఊపి రుండగా అడుగుతానా ?

శారద : ఊపిరి పోతే ఇంకెలా అడుగుతావత్తయ్యా !

తల్లి : శారద ! ఏమిటే అది ! పెద్దవాళ్ళతోనా - వేళాకోళాలు

పుల్లమ్మ : వేళాకోళా లాడినా ఫర్వాలేదు వెక్కిరించినా ఫర్వాలేదు. ఆ గిన్నెడు నెయ్యా ఇచ్చావంటే ?

తల్లి : నీ విన్ని సార్లడగాలా వదినా ? ఉంటే ఇవ్వనూ ?

రాధ : అమ్మా ! నాకు వెన్న

తల్లి : ఏం వెన్నే ? మరీ ప్రాణం తీస్తున్నావు ?

(ప్రవేశం - విమల, లలిత)

విమల : ఏమోయ్ ! శారద ! ఏంచేస్తున్నావ్ ?

శారద : ఏం లేదోయ్ !

లలిత : నువ్వు చెప్పకపోతే మాన్లే వోయబ్బా ! మాకు తెలుసులే పాతాలు రుబ్బే స్తున్నావు.

శారద : నయం పచ్చడి రుబ్బేస్తున్నా ననలేదు !

పుల్లమ్మ : సరే! తప్పేదేముందమ్మా, ఇవాళ కాకపోతే రేపైనా రుబ్బవద్దూ పచ్చళ్లు.

లలిత : నాంసెన్స్ ! పచ్చడి రుబ్బక్కర్లేదు-గిచ్చడి రుబ్బక్కర్లేదు. ఆడవాళ్ళంటే వంటింటి కుందేళ్లనుకున్నారా. ఆ రోజులు మారిపోయాయండి పుల్లమ్మ పిన్నిగారూ !

పుల్లమ్మ : ఏమోలేవే అమ్మా ! మాకేం తెలుస్తుంది? పాతకాలపు వాళ్ళం. రేపు మీరు పెళ్లిళ్లుచేసుకొని మొగుళ్లచేత రుబ్బించండి పచ్చళ్లు.

(అందరూ నవ్వుతారు)

రాధ : అమ్మా ! వెన్న !

విమల : వెన్నేమిటోయ్ ?

రాధ : చేతిలో వెన్నముద్ద లేదూ ? అది

లలిత : ఓహో అదా ? అది ఊరికనే ఎలా వస్తుంది ? చెంగల్వ పూదండ పట్టు దట్టి అవన్నీ ఉండొద్దూ ?

పుల్లమ్మ : అయితే ఏమంటావమ్మా వదినా ?

తల్లి : చెప్పానుగా

పుల్లమ్మ : అయితే లేదుపో ? గట్టి చిక్కువచ్చిందే

తల్లి : పోనీ ఓ గంటాగి రావమ్మా వదినా, ఈ లోపల కరగేసి ఉంచుతాను.

రాధ : కరగవెయ్యొద్దు - నాకు వెన్న పెట్టు.

లలిత : వెన్న ఊరికనే ఎలా వస్తుంది. సందే తాయెతలు, సరిమువ్వ గజ్జెలు కట్టుకురా !

పుల్లమ్మ : రక్షించావమ్మా వదినా ! ఈ గిన్నె లోపలే ఉంచు మళ్లా వస్తాను.

తల్లి : కాసేపు ఇక్కణ్ణే ఆడుకుంటూ ఉండండి - నే వెళ్ళి పనిచూసుకొస్తాను. (లోపలకు వెళ్లింది)

రాధ : అమ్మా వెన్నే ! (తల్లితో లోపలకు వెళ్ళబోతుంది)

లలిత : నేను పెట్టిస్తానన్నాగా ! ఇలారా ! (రాధను చెయ్యిపట్టుకొని తీసుకు వచ్చింది)

రాధ : ఊ వట్టిదే ! మీ మాటలన్నీ వట్టివే ?

శారద : లలిత మాట మాత్రం చాలా గట్టి

రాధ : అయితే పెట్టు వెన్న

లలిత : అయితే ఇలారా ! (రాధ చేతిని పట్టుకొని) శారదా ! ఇలా రావోయ్

(శారద వచ్చింది. లలిత శారద చెవిలో రహస్యం చెప్పింది. ఇద్దరూ అవున న్నట్లుగా తలలూపి, లోపలికి పోతారు. ప్రవేశం సరోజ లోపల్నుంచి)

సరోజ : అంతా ఇక్కడే ఉన్నారే !

లలిత : ఓహో ! సరోజా ! నువ్వెప్పుడొచ్చావోయ్ !

సరోజ : ఇప్పుడే

లలిత : ఎటు నుంచీ ?

సరోజ : లోపల్నుంచి

లలిత : లోపలి కెప్పుడు వెళ్లావు ?

సరోజ : రావటమే లోపల్నుంచి వస్తున్నాను.

లలిత : అదేమిటోయ్

శారద : వాళ్లిల్లు సరిగ్గా మాయింటి వెనుకాలే గదోయ్ ! అదెప్పుడు మాయింటికి వచ్చినా, దొడ్డి గుమ్మంలోంచే వస్తుంది.

లలిత : ఓహో అదా సంగతి !

సరోజ : ఆ అదే !

శారద : సరేగాని సరోజా ! ఏమిటిప్పుడు వచ్చావ్ ?

సరోజ : మా యింట్లో ఓ చిన్ని కృష్ణుడు వెలిశాడోయ్ !

రాధ : వెన్న ముద్దల కృష్ణుడేనా ?

సరోజ : ఆ

విమల : కృష్ణుడెలా వెలుస్తాడో ?

సరోజ : వెలయకేంజేస్తాడు ? మానాన్న గారికేమో కృష్ణుడంటే తగని భక్తి. మా అమ్మకేమో తగని ప్రేమ !

శారద : నీకేమో తగని అల్లరి ?

లలిత : వాడికేమో తగని అల్లరి ?

సరోజ : రైట్ ! కాబట్టే మా యింట్లో వెలిశాడు.

లలిత : ఆ కృష్ణుడెవరో నాకు తెలుసులే

విమల : నాకూ తెలుసులే

సరోజ : (విమలతో) తెలిస్తే చెప్పు నీవు ?

విమల : (లలితతో) నీవు చెప్పు

లలిత : (శారదతో) నీవు చెప్పు

శారద : (సరోజతో) నీవే చెప్పవే

సరోజ : చెప్పట మెందుకు ? మా యింటికి రండి ప్రత్యక్షంగా చూద్దురుగాని

శారద : మీ యింటికెందుకే ? ఆ వెలిసిన కృష్ణుణ్ణి ఇక్కడికి పిలుచుకురా !

సరోజ : రానంటున్నాడు.

శారద : వెన్నముద్దలు పెడతామను, తప్పకుండా వస్తాడు.

రాధ : అక్కా ! నాకు పెడతావా వెన్న ?

సరోజ : ఆ కళ్లు మూసుకొని ప్రార్థన చేస్తే తప్పకుండా పెడతాడు

విమల : ఆ కృష్ణుడెవరో నేను చెప్పనా ?

రాధ : వెన్న ముద్దల కృష్ణుడు

సరోజ : అవునే వెన్న ముద్దల రాధా

విమల : కాదే ! వాళ్లచెల్లెలు, దానికి కృష్ణుడి వేషం వేశారు

రాధ : కాదు కృష్ణుడే !

శారద : అవునవును కృష్ణుడే !

సరోజ : మీరంతా కళ్లు మూసుకోండి - రప్పిస్తాను కృష్ణుణ్ణి.

(లైట్లు ఆఫ్. కృష్ణుడు రంగస్థలం మధ్య ఎత్తయిన స్థలంమీద నిల్చొని ఉంటాడు. చేతిలో వెన్నముద్ద ఉంది. రాధ ఎదురుగా మోకరిల్లి ప్రార్థన చేస్తున్నది. లైట్లు ఆన్)

చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ
బంగారు మొలత్రాడు పట్టుదట్టి
సందెతాయెత్తులును సరిమువ్వ గజ్జెలు
చిన్ని కృష్ణ నిన్ను చేరికొలుతు.

(కృష్ణుడు చిరునవ్వు నవ్వాడు)

రాధ : కృష్ణ వెన్న పెట్టవూ ?

కృష్ణుడు : నేను పెట్టను

లలిత : అలా అడిగితే వెన్న పెట్టడే ! నృత్యం చెయ్యాలి.

రాధ : నాకు రాదుగా

లలిత : నీవలాగే ధ్యానం చేస్తూ కూర్చో - ఏమోయ్ శారదా, నీవూ నేనూ పాట పాడుదాం. విమల, సరోజ డ్యాన్సు చేస్తారు. ఏమంటారోయ్ ?

అంతా : సరే

(లలిత, శారద పాట పాడ్తారు, విమల, సరోజ, నృత్యం చేస్తారు)

నవ్వులొలయు మోమువాడా !
నందగోపకిశోరా !రారా!
నిన్నె నమ్మియున్నదాన,
నన్ను బ్రోవరా ! ॥నవ్వు॥

గోపికా మానస చోరా
గోవర్ధనగిరి ధారా
వేణుగాన వినోదా ! కృష్ణా
వేగ రారా ! ॥నవ్వు॥

వెన్నదొంగా ! చిన్నికృష్ణ
నిన్నె నమ్మియున్నదాన
వెన్నబెట్టి నన్నుబ్రోవ
జాల మేలరా ! కృష్ణ ॥నవ్వు॥

(కృష్ణుడు చేతిలో నున్న వెన్నను కొంచెం కొంచెంగా తింటున్నాడు)

రాధ : కృష్ణా వెన్నంతా నువ్వే తినేస్తున్నావా ?

కృష్ణుడు : ఇదిగో రాధా ! నీకూ పెడతాగా !

(కృష్ణుడు రాధకు వెన్న పెడుతూండగా)

(తెర)

సూచన : నృత్యం చేయగల పిల్లలుంటే నృత్యం చేయిస్తే బాగుంటుంది. పిల్లలు పాట పాడలేకపోతే నేపథ్యంలోనుంచి పాడించవచ్చు.



# గాలిపటం

మద్దిపట్ల వెంకట్రావు



పాత్రలు :

| | |
|---|---|
| బాబ్జీ | సుబ్బరామయ్య |
| ఆనంద్ | రవి |
| శేఖర్ | సుభద్ర |
| కుమార్ | శాంతమ్మ |
| మేష్టారు | శారద |

## రంగం-1

(బాబ్జీ గాలిపటం ఎగరవేస్తూ పాట పాడుతూ వుంటాడు)

బాబ్జీ : .... (పాట)

ఆడాలి !.... ఆటలాడాలి !
పాడాలి! .... పాటపాడాలి! ॥ఆడా॥

బొంగరాల ఆటంటే
బోలెడంతా సరదా !
గోళీలు – గోటిబిళ్ళ
గొప్పవైన ఆటలు ॥ఆడా॥

దాగుడు మూతలు – తుమ్మెంట
దానికవే మరి చెప్పతగ్గవి !
చెడుగుడు – చెట్టు కొమ్మచ్చులు
చెప్పలేము మరి వాటి మజా ॥ఆడా॥

చింతగింజలు – గిరిక
చిన్నాళ్ళాడే ఆట !
ఏ ఆటైనా – ఏ పాటైనా
ఎంతో చక్కగ ఉంటుంది ! ॥ఆడా॥

(ఈలోగా బళ్ళోకెళ్ళే కొందరు పిల్లలు వస్తారు.)

ఆనంద్ : బాబ్జీ!.... ఒరేయ్ బాబ్జీ!.... రా! రా! స్కూలుకెడదాం!

బాబ్జీ : ఒరేయ్ ఆనంద్!.... కొంచెం గాలిపటం అక్కడ పట్టుకోరా!

ఆనంద్ : నేను పట్టుకోను! స్కూలుకి టైం అయిపోయింది! నువ్వు రాకపోతే నే పోతా!

బాబ్జీ : ఒరేయ్!.... ఒక్కసారి పట్టుకోరా!.... బాబ్బాబు....

ఆనంద్ : (వినకుండా వెళ్ళబోతాడు. బాబ్జీ వాడి కాలర్ పట్టుకొంటాడు)

బాబ్జీ : ఒరేయ్! పట్టుకుంటావా?.... లేదా?

ఆనంద్ : నే పట్టుకోను!.... స్కూలు కెళ్ళాలి!.... ఊ! వదులు!

బాబ్జీ : (వాడిని కొడుతూ) పట్టుకోవూ?

ఆనంద్ : (ఏడుస్తూ) ఉండు! మేష్టారితో చెప్పి, నిన్ను తన్నించకపోతే చూడు! (అంటూ ఏడుస్తూ వెడతాడు)

బాబ్జీ : .... నీ తాతతో చెప్పుకో!.... నాకేం భయమా?

శేఖర్ : కుమార్! చూడరా! వాడెప్పుడూ యింతే. స్కూలుకి రాడు! ఎప్పుడూ ఆటలే!.... ఏమన్నా అంటే అందరితో దెబ్బలాడతాడు! పదరా మన కెందుకు!.... (అంటూ వెడుతుంటారు)

బాబ్జీ : కుమార్!.... కుమార్!.... ఒరేయ్! వెళ్ళి పోతున్నావా?

కుమార్ : ఔను! ఏం! నీకు స్కూలు అఖ్ఖర్లేదుగా!

బాబ్జీ : ఓ! పెద్ద నీకొక్కడికే కామోను!.... నేనూ వస్తున్నా! ఆగరా! (అంటూ గాలిపటం, పుస్తకాలు సర్దుతాడు)

శేఖర్ : ఓహో! ఏంబుద్ధి వచ్చిందిరా యివాళ! స్కూలుకి వస్తున్నాడు!

బాబ్జీ : ఏంరా!.... నీకేం? నాయిష్టమయితే వస్తా! అది నాయిష్టం!

శేఖర్ : కాదుమరి.... నిన్నడిగే వాళ్ళెవరూ?.... ఏమన్నా అంటే మీ అమ్మనే తిడతావటగా!

బాబ్జీ : ఎవడురా? నీకు చెప్పింది?.... మా అమ్మని తిట్టానా?.... యిదిగో! మా అమ్మ పేరెత్తావంటేనా....

శేఖర్ : ఏం! ఉన్నమాటంటే ఉలుకెందుకు? ఏం చేస్తావేమిటి?

బాబ్జీ : ఏం చేస్తానా ?.... మళ్ళీ అను ఆమాట ! దవడ పళ్ళు విరగ్గొడుతాను జాగ్రత్త !

శేఖర్ : ఒక్కసారి కాదు ! వందసార్లంటాను ! నువ్వు మీ అమ్మని....

(అనబోతుండగా బాబ్జీ ఒక్క లెంపకాయ వేస్తాడు. యిద్దరు కలబడుతారు ! కుమార్ చూస్తూ ఊరుకుంటాడు. ఈలోగా బాబ్జీ తల్లి సుభద్రమ్మ కూరలసంచితో ప్రవేశం)

కుమార్ : అత్తా !.... చూడు ! బాబ్జీ శేఖర్ని ఎలా కొడుతున్నాడో !

(సుభద్రమ్మ కొడుకుని చెయిపట్టి లాగి ఒకటి వేస్తూ)

సుభద్ర: ఒరేయ్ ! బుద్ధిలేదురా !.... వాడిని పాపం అలా ఎందుకు కొడుతున్నావ్?

బాబ్జీ : (గుంజుకుంటూ) ఉండమ్మా !.... వెధవ.... వళ్ళు హూనంచేస్తా ! లేక పోతే నా.... (అంటూ పోబోగా మళ్ళీ బాబ్జీని పట్టుకుని లాగుతుంది)

ఆనంద్ : (లేస్తూ) పిన్నమ్మా ! అనవసరంగా నన్ను కొట్టాడు.... రోజూ యింతే పిన్నమ్మా ! బళ్ళోకి రాకుండా అందర్ని కొడుతున్నాడు !

సుభద్ర : ఊర్కో బాబూ ! వాడికి బుద్ధి నేనే చెబుతాలే ! నువ్వెళ్లు బాబూ !

(అనగానే పిల్లలిద్దరూ వెడతారు)

సుభద్ర : (కొడుకుని కొడుతూ).... వెధవ ! బుద్ధిలేదూ ! అందర్నీ కొడతావా ! వెధవా !.... (అంటూ కొడుతూ వుంటుంది. ఈలోగా మేష్టారు ప్రవేశం)

మేష్టారు : (వస్తూనే).... ఆగు ! ఆగు సుభద్రమ్మా !.... పిల్లవాడు - మెల్లిగా చెప్పి అదుపులో పెట్టుకోవాలిగాని ! అలా గొడ్డుని బాదినట్టు బాదితే లొంగొస్తాడా !

సుభద్ర : ఏం చెయ్యమంటారు పంతులుగారూ ! ఒక్కగానొక్క కొడుకు ! వాడు తప్పితే నాకు దిక్కెవరు చెప్పండి ! ఏదో నన్నుద్ధరించి వెలగబెడతాడను కొంటున్నా ! యిల్లా తగలబడుతున్నాడు ! అంతా నాఖర్మ ! లేకపోతే నిక్షేపంలాంటి వాళ్లనాన్న.... (అంటూ కంటతడి పెడుతుంది)

మేష్టారు : ఊర్కో ! సుభద్రమ్మా ! పాత సంగతులన్నీ తవ్వుకొని దుఃఖిస్తే ఎలా ! .... ముందు జరగవలసింది ఆలోచించాలి గాని !

సుభద్ర : ఏం చెయ్యను పంతులుగారూ ! వాడికి నాలుగు ముక్కలంటుతాయని స్కూల్లో జేర్పిస్తే యిల్లా తయారయాడు !

మేష్టారు : నేనోమాట చెప్పనా !

సుభద్ర : చెప్పండి పంతులుగారూ !

మేష్టారు : పిల్లవాడు చాల అల్లరివాడులా తయారయాడు. సుభద్రమ్మా !.... అన్నట్లు పట్నంలో ఎవరో మీ తమ్ముడున్నాడు కదూ ! అతని కప్పగించరాదూ !

సుభద్ర : ఎలా చెప్పండి ! వాడిదా గంపెడు సంసారం. పైగా అతని భార్య వట్టి గయ్యాళిది. ఏం చెయ్యమంటారు చెప్పండి !

మేష్టారు : సుభద్రమ్మా !.... ఏది ఏమైనా పిల్లవాడిని అదుపాజ్ఞలలో ఉంచాలి ! ఈ వయసుంది చూశావ్ ! ఇది బాల్య యౌవనదశలకు సంధిలాంటిది. పిల్లలు యిలా అల్లరి పనులు చేస్తూనే ఉంటారు. కాని వారికి తగ్గ అదుపూ ఆదరం లేనట్లయితే వీళ్ల తెగిన గాలిపటంలా తయారవుతారు !.... అందు కని నామాట విని....

సుభద్ర : అదుగో మాటలోనే మా తమ్ముడు కూడా యిలానే వస్తూన్నాడు !....

సుబ్బ : (వస్తూనే) నమస్కారం పంతులుగారూ !.... ఏమిటి విశేషం ?

మేష్టారు : చూడు ! సుబ్బరామయ్య ! ఏముంది. నీ మేనల్లుడి గురించే ! అసలు ఈ వయసులో ఉండే పిల్లలకి అటు పెద్దతనం యిటు చిన్నతనం తెలియవు. పెద్దల్లో పిల్లలమని. పిల్లల్లో పెద్దలమని అనుకుంటూ సరయిన సహ వాసాలు దొరక్క పోతే మరీ దురలవాట్లకు లోనయి పాడై పోతుంటారు!

సుబ్బ : అయితే పంతులుగారూ ! సుభద్రకా ఒక్కగానొక్క కొడుకు ! వాడి భవిష్యత్తు....

మేష్టారు : అందుకేగా !.... గట్టి అదుపు, ఆదరం కావాలంటున్నాను !.... ఏమైనా యిదుగో సుబ్బరామయ్య ! నీ మేనల్లుడి భారం నీవు మోయాల్సిందే !

సుబ్బ ! చూశావా! అక్కాయ్! నేనీ విషయం వెయ్యిసార్లు చెప్పాను!.... బాబ్జీని నాతో పంపవే అంటే విన్నావూ !

సుభద్ర : అది కాదురా తమ్ముడూ! ఒక్కగానొక్క నలుసు!.... వాడిని విడిచి నేను మాత్రం ఎలా ఉండగలను చెప్పు ?

సుబ్బ : అదీ నిజమే! అందుకని వాడు అల్లరి చిల్లరి వాడులా తయారవుతుంటే చూస్తూ ఊరుకుంటానంటావ్!

సుభద్ర : నేనేం చెయ్యను చెప్పు! పంతులుగారూ! నన్నేం చెయ్యమంటారు ?

మేష్టారు : యిదిగో సుభద్రమ్మా!.... యింక ఆలోచన దేనికి! తక్షణం నీ తమ్ముడితో పంపేసెయ్యి!.... పట్నంలో నలుగురినీ చూసైనా కాస్త బుద్ధిని పడుతాడు!.... యిదిగో సుబ్బరామయ్యా! నే వస్తా! అంతా నీదే భారం!.... వస్తా! సుభద్రమ్మా! (వెడతాడు)

బాబ్జీ : అమ్మా!.... అమ్మా!.... నేను వెళ్లను!.... నిన్ను వదలి నేనెక్కడికీ వెళ్లను!.... యిక్కడే ఉంటాను!

సుబ్బ : బాబు! నామాట విను! అక్కడ శారద, రవీ ఉన్నారుగా. వాళ్లతో కలిసి చక్కగా చదువుకుందువుగాని! నిన్ను తీసుకెళ్లాలనే వచ్చాను!

బాబ్జీ : నే రాను!.... నాకు యిక్కడే బాగుంటుంది! అమ్మా నే రానని చెప్పమ్మా!

సుభద్ర : అబ్బ ఊర్కోరా! నా ప్రాణం తియ్యకు! అడ్డగాడిదలా యిన్నాళ్లూ తిరిగింది చాలు-రేపే మామయ్యతో వారి ఊరు వెళ్ళి చదువుకో!

బాబ్జీ : అమ్మా!.... నేవెళ్లను! అమ్మా! యింకెప్పుడూ అల్లరి చెయ్యనమ్మా! నువ్వు చెప్పినట్లు వుంటానమ్మా!.... అమ్మా!

సుభద్ర : ఒరేయ్!.... నామాట వినరా! అమ్మమాట వినవూ! నేను బ్రతకాలని లేదురా నీకు!.... వెళ్లవూ!

బాబ్జీ : అమ్మా! యీ ఒక్కసారేనమ్మా!.... యింకెప్పుడూ నీ మాట కాదననమ్మా!.... మామయ్యా! నీకు దండం పెడతా!.... నేనిక్కడే బుద్ధిగా ఉంటా మావయ్యా.

సుబ్బ : సుభద్రమ్మా! నీకెందుకు. నువ్వూర్కో! నేను వీడిని రేపు తీసుకెడతాగా! అందుకేగా నే వచ్చింది!

బాబ్జీ : నేను రాను! కావలిస్తే నువ్వే వెళ్లు!.... నేను రాను! అమ్మా!

సుభద్ర : ఒరేయ్! వెళ్లవూ!.... వెళ్లవూ! యిదిగో ఆఖరిసారి చెబుతున్నా, ఏ నూతిలోనో పడి ఛస్తాను!.... నామాట వినవా!

సుబ్బ : ఊర్కో సుభద్రా!

బాబ్జీ : అమ్మా! అంతమాటనకమ్మా! నువ్వు లేకపోతే నాకేముందమ్మా!.... అమ్మా నువ్వు చెప్పినట్లే చేస్తానమ్మా! వెడతానమ్మా!.... మావయ్యగారి ఊరు వెడతానమ్మా! నీమాట వింటానమ్మా!.... నువ్వు చావద్దమ్మా!.... వెడతానమ్మా!

సుబ్బ : నడు సుభద్రమ్మా!.... ముందు యింటికి నడు!....

(అమ్మా! అంటూ బాబ్జీ ఏడుస్తూంటాడు. సుభద్రమ్మ కళ్లు ఒత్తుకుంటూ తమ్ముడి వెనకాల వెడుతుంది. తెరపడుతుంది)

# రంగం - 2

(సుబ్బరామయ్య ఇల్లు! రెండు కుర్చీలు! ఒక టేబిలు! టేబుల్ మీద పుస్తకాల షెల్ఫు, ఒక దండెం. దాని మీద కొన్ని బట్టలు. ఒక మడత మంచం మడిచి ప్రక్కగా పెట్టబడి ఉంటుంది.)

శాంతమ్మ: ఓరేయ్!.... బాబ్జీ!.... నిన్నేరా:.... ఓరీ! నీయిల్లు కూలబడా!.... యిక్కడ చచ్చావట్రా! దున్నపోతులా తిన్నావు.... కంచాలు కడిగావ్రా!

బాబ్జీ : కడిగి అక్కడే పెట్టేనత్తయ్యా!.... స్కూలుకు టైమవుతే....

శాం : ఓరి నీ చదువు చట్టుబండలు కానూ!.... దొడ్లో బాల్చిలో నీళ్లు తోడావ్రా!.... స్కూలుట స్కూలు....నీకోసం స్కూలక్కడ ఆగదు కాని వెళ్లి....ముందు నీళ్లుతోడు.

బాబ్జీ : అల్లాగే అత్తయ్య! (అంటూ పోబోగా)

శాం : అత్తయ్యట.... బొడ్డుకోసి పేరెట్టాడు.... ఏం! నాలిక లాక్కుపోతుందా!.... అత్తయ్యగారూ!.... అనలేవూ?

బాబ్జీ : అల్లాగే అత్తయ్యా!

శాం : అదుగో....మళ్లీ.... ఆ మాటన్నావంటే వళ్లు వలుస్తాను!.... వెళ్లు!

బాబ్జీ: అల్లాగే అత్తయ్యగారూ! (అంటూ లోపలికి వెడతాడు.)

శాం : దిక్కుమాలిన సొద!....ఈ ముదనష్టపువాడిని యింటిమీదకు తీసుకొచ్చి పడేశారు! ముప్పొద్దులా మేపలేక చస్తున్నాను.

సుబ్బ : (ప్రవేశిస్తూ)....ఏమేయ్....కోపం....యిక్కడున్నావా....కోపం!

శాంత : యిదుగో!....మీకు వెయ్యిసార్లు చెప్పాను! నన్నలా పిలవద్దని!

సుబ్బ : ఏం: తప్పేముంది!....శాంతం బదులు కోపం అని పిలిచాను!

శాంత : ఆ! పిలుస్తారు పిలవకేం! ఆ దిక్కుమాలినవాడు....అత్తా! అంటూ బొడ్డు కోసి పేరెట్టాడు!....అయినా నేనంటే యీ యింట్లో గౌరవం ఎవరి కేడ్చి చచ్చిందట!

సుబ్బ : యిదిగో! కోపం!....నీ కోపం తగ్గించుకుంటే అన్నీ బాగానే ఉంటాయి! ....అయినా అస్తమానూ వాడిని....

శాంత : ఏం?....నేనేమన్నా కొరుక్కుతిన్నానా!....దిక్కుమాలిన వెధవ! ఉన్న వాళ్ళకే చెయ్యలేక చస్తుంటే వీడొకడు నా ఖర్మకి!

సుబ్బ : యిదుగో చూడు! వాడు తిండికిలేక రాలేదు మనింటికి. తండ్రిలేని పసివాడు! ....పల్లెటూర్లో చెడిపోతుంటే....

శాంత : అని చెప్పి ఈ పట్నంలో వెలగబెడతాడని తీసుకువచ్చారు అంతేనా!

సుబ్బ : చూడు!.... మా సుభద్రకా ఉన్నదల్లా వాడొక్కడే ఆధారం.... వాళ్లు మనకు చేసిన ఉపకారానికి ఆ కుర్రవాడిని పైకి తీసుకువచ్చామా, ఋణం తీర్చుకున్న వాళ్లమవుతాం!....కాస్తంతావాడిని జాగ్రత్తగా....

శాంత : ఏం! జాగ్రత్తగా చూడక నేనేం కొరుక్కుతింటున్నానా?....మీరు, మీరూ గంగలో దిగండి! నా కవతల బోలెడు పనుంది!.... ఒరేయ్ చవట పీనుగా! (అంటూ లోపలి కెడుతుంది)

సుబ్బ : ఖర్మ.... ఏదో వెలగబెడతానని వాడిని ఇక్కడకు తీసుకువచ్చాను! (బాబ్జీ వస్తాడు) బాబూ! బాబ్జీ అదేమిటి నువ్వు స్కూలుకు వెళ్లలేదా?

బాబ్జీ : లేదు మావయ్యా!.... యింట్లో అత్తయ్య పని చెబితే....

సుబ్బ : మానేశావు!....చూడు బాబూ! మీ అమ్మ నీమీద బోలెడు ఆశలు పెట్టుకుంది! రోజూ బడికెళ్లి బాగా చదువుకో బాబూ!....మీ అత్తయ్య అలా పనులు చెబుతూనే ఉంటుంది. రేపట్నుంచి టైముకి స్కూలు కెళ్లిపో బాబూ!....మీ అత్తయ్య కొంచెము కోపిష్టిది.... ఏం మనసు నొచ్చుకోకు బాబూ!

బాబ్జీ : అల్లానే మామయ్యా!.... (సుబ్బరామయ్య బయటకు వెడతాడు)

(బాబ్జీ ఏదో చదువుకుంటూ ఉంటాడు. ఈలోగా శారద రవీ స్కూలు నుంచి వస్తారు)

రవి : వెధవ స్కూలు!.... వట్టిబోరు!.... ఈ మేష్టర్లకేం పనిలేదు! రోజూ పాఠాలు, హోంవర్కు.... నెలకో పరీక్ష.... ప్యాసు, ఫెయిలు!

శారద : అదేమిట్రా అన్నయ్యా !.... అలా తిడతావు ! పాఠాలు.... పరీక్షలు లేకపోతే ఎలారా !

రవి : ఎల్లా.... గేమిటి? నీ మొహం ! పాఠాలు పరీక్షలే నేమిటి నేర్చుకోవల సింది అస్తమానూ !

శారద : లేకపోతే.

రవి : చక్కగా.... సినిమాలూ.... ట్విస్టు డాన్సులూ డిటెక్టివ్ కథలూ.... యింకా ఎన్నో అలాంటివి చెప్పకూడదూ !....

శారద : ఛీ !.... అసహ్యం ! బళ్ళో అవి పెడితే అంతా అడ్డగాడిదల్లా తయార వుతారు.

బాబ్జీ : అవును శారదా !.... మా అమ్మ నన్ను ఎప్పుడూ 'అడ్డగాడిదా' అంటుండేది !

శారద : ఛీ ! ఊర్కో బాబ్జీ ! నువ్వు చాల మంచివాడివి ! నువ్వుకాదు. మా అన్నయ్య అసలు అడ్డగాడిద !

రవి : ఏమిటే నన్నంటున్నావ్ !.... నన్నన్నావంటే చంపేస్తా ! జాగ్రత్త !

శారద : ఒక్కసారి గాదు. వందసార్లంటాను !.... ఆ లక్షణాలన్నీ నీకు పూర్తిగా ఉన్నాయి !

రవి : ఏమిటే ప్రేలావ్.... (అంటూ మీదకెళ్ళబోతే శారద లోపలికి పరుగెడు తుంది)

రవి : ఒరేయ్ !.... అడ్డగాడిదా !.... నాకాలి బూటు విప్పరా !

బాబ్జీ : (కాలుపట్టుకు లాగుతాడు. రవి క్రిందపడతాడు)

రవి : ఒరేయ్ ! అడ్డగాడిదా ! నాకాలు పట్టుకు లాగుతావేమిట్రా ! అలా కాదురా ముందు ఆ లేసులు విప్పరా ! ఒట్టి అయోమయం !.... ఊ!.... అక్కడ పెట్టు ! ఈ పుస్తకాలు.... లోపలపెట్టు !.... వెళ్ళి మంచినీళ్లు పట్రా !.. (బాబ్జీ లోపలికెళ్ళి నీళ్లు తెస్తాడు. కొంచెం నీళ్లు మీదపడతాయి)

రవి : ఒరేయ్ కళ్లు కనబడలేదూ ! నీళ్లు మీద పోస్తావా? రాస్కెల్ ! (అంటూ కొడతాడు)

బాబ్జీ : చూడలేదు రవీ !.... మరింకెప్పుడూ పొయ్యను !.... ఒదులు ! ఒదులు !

శారద : (వస్తూ) అన్నయ్యా ! ఒరేయ్ ! వాడిని ఒదలరా !.... ఒదలవ్ ! అదుగో అమ్మ !

(అనగానే వదలి లోపలికి పరుగెడుతాడు)

బాబ్జి : (కళ్లు తుడుచుకుంటూ) అమ్మా!.... (అని ఏడుస్తాడు)

శారద : ఊర్కో బాబ్జి !.... నాన్నరాగానే చెప్పి వాడిని నాలుగు చివాట్లేయిస్తాను! ఊర్కోవూ !

బాబ్జి : (తలవంచుకొని మోకాళ్లమీద కూర్చుంటాడు)

శారద : బాబ్జి !.... యిదిగో యిది తిను ! (అంటూ మిఠాయిస్తుంది. కాని తినడు) తిను బాబ్జి !

బాబ్జి : అమ్మో ! నాకొద్దు ! అత్తయ్య చూస్తే నన్ను చంపేస్తుంది ! నే తినను!

శారద : ఫరవాలేదులే ! అత్తయ్య లేదుగా !.... తిను !.... ఊ !.... తినవూ తినకపోతే ఒట్టే ! (అనగానే తినేస్తాడు)

బాబ్జి : శారదా!.... బళ్లో యివాళ ఏం చెప్పారు?

శార : లెక్కలు చెప్పారు!.... యింగ్లీషు కొత్త పాఠం చెప్పారు.... తెలుగు లోనూ కొత్త పాఠం చెప్పారు!

బాబ్జి : ఏం పాఠం?

శార : భలే ఉందిలే!.... నీకు చెప్పనా?

బాబ్జి : చెప్పు!

(దేశమంటే మట్టి కాదోయ్ - దేశమంటే మనుజులోయ్! అంటూ యిద్దరూ వంత పాడుతారు)

సుబ్బ : (ప్రవేశిస్తూ) అమ్మా! శారదా! ఏం చేస్తున్నావ్?

శార : బావకి పాఠం చెబుతున్నా నాన్నా!

సుబ్బ : మంచిదమ్మా!.... నువ్వొక్కదానివయినా వాడి ప్రాణానికి హాయిని కలిగిస్తున్నావ్!.... రా బాబూ! యిలా కూర్చో! (అంటూ యిద్దర్నీ చెరోవైపు కూర్చోబెట్టుకుంటాడు)

(రవి టేబిల్‌మీద నున్న సీసా క్రింద పారేస్తాడు. అది పగిలి పోతుంది. రవి పారిపోతాడు. అదే సమయానికి బాబ్జి అక్కడికి వస్తాడు. ఆ చప్పుడువిని శాంతమ్మ వస్తుంది)

శాంతమ్మ : (వస్తూనే)....అయ్యో!.... అయ్యో!.... నీ మొహం మండా!.... నీ యింట జోడుపీనుగు లెళ్లా!.... నిక్షేపంలాంటి సీసా కాస్త నీ పొట్టను పెట్టుకున్నావట్రా!.... ముదనష్టపు చచ్చినాడా!.... చావు!.... చావు!.... (అంటూ చేతిలో ఉన్న గరిటతో కొడుతుంది)

బాబ్జి : అమ్మో!.... బాబోయ్!.... అత్తయ్యా! నీ కాళ్లకి దండం పెడతా?.... నేను కాదత్తయ్యా! కావాలంటే శారదనడుగు! అమ్మబాబోయ్!.... అత్తయ్యా! అమ్మ!

శాంత : వెధవా! పైగా ఆబద్ధాలొకటా!.... పిల్లికి.... ఎలక సాక్ష్యం అన్నట్లు! ....నీకదొకటి తోడు!.... ఏదీ! దాని మక్కెలిరగ్గొడతాను!

బాబ్జి : వద్దత్తయ్యా! కావాలంటే నన్ను కొట్టు!.... శారదని కొట్టకు అత్తయ్యా! ....అమ్మ!....

శాంత : చావు!.... ఎందులో అయినా దిగి చావు! నీవు ఒక్కక్షణం మా యింట్లో ఉండటానికి వీల్లేదు!.... పో!.... దిక్కుమాలినవాడా!.... అక్కడి కక్కడ పుట్టిల్లు తగలేసి, యిక్కడ కూడా తగలేద్దామని వచ్చావా !.... పో!.... (అంటూ గెంటేస్తుంది)

బాబ్జి : అత్తయ్యా!.... ఎక్కడికి పోతానత్తయ్యా?.... అమ్మ! అమ్మ!

శాంత : ఏట్లోకి పో!.... ఎందులో నయినా దిగి చావు!....

(అని శాంతమ్మ బాబ్జిని బయటకు గెంటేస్తుంది! బాబ్జి ఏడుస్తూ ఏం చేయడానికి తోచక తిరిగి వాళ్ల ఊరు వెడితే వాళ్లమ్మ తిడుతుందేమోనన్న భయంతో సముద్రం ఒడ్డుకు వెళ్లి కూర్చుని తన కష్టాలను తలచుకొని ఏడుస్తూంటాడు. ఈలోగా పెద్ద తుఫాన్ వస్తుంది)

(పాట)

అమ్మా!........ అమ్మా!
అమ్మమాట విననందుకు
అనుభవించుచున్నాను!
ఆదరించువారు లేక
అనాధను అయినాను! అమ్మా! అమ్మా!
నా బాధను పడలేక
నన్ను దూరమంపినావు! అమ్మా!
నేచేయని నేరానికి
నన్ను కొట్టి హింసపెట్టి
యింటినుండి గెంటినారు! అమ్మా! అమ్మా!
యింకెక్కడి కెళ్ళగలను.... అమ్మా!
నాకు దిక్కు చావు తప్ప
యింకేమిటి మిగిలింది! అమ్మా! అమ్మా!

సుబ్బ : బాబ్జి!.... బాబ్జి!.... (అంటూ తెరవెనుక కేకలు)

బాబ్జి : అమ్మా!.... అమ్మా!.... అమ్మా! (అంటూ బాబ్జి స్పృహతప్పి పడి పోతాడు.)

సుబ్బ: (బాబ్జిని చూసి) బాబ్జి! ఏమిటి నాయనా! యిలా తడిసిపోయావు!.... అయ్యో!.... వళ్ళంతా కాలిపోతూంది! నడు నాయనా యింటికి (అంటూ బాబ్జిని ఎత్తుకు తీసుకెడతాడు—తెర)

# రంగం-3

(సుబ్బరామయ్య ఇల్లు)

సుబ్బ: .... ఏమేవ్! శాంతా?.... గమ్మున మంచం వాల్చు.... యిదిగో వాడికి ఆ తడి గుడ్డలు ఊడదియ్యి!.... ఒరేయ్ రవీ త్వరగా వెళ్లి డాక్టర్ని పిలుచుకురా!.... అమ్మా, శారదా ఆ దుప్పటి యిలా తే!....

శారద: నాన్నా!.... బాబ్జి వళ్లు సలసలా కాగిపోతోంది!

సుబ్బ: బాబ్జి!.... నాయనా!

బాబ్జి: .... అమ్మ!.... అమ్మా!.... అత్తయ్య కొట్టకు! యింకెప్పుడూ తప్పు చెయ్యను!... అత్తయ్య!.... అత్తయ్య! (అంటూ పలవరిస్తాడు)

సుబ్బ: ఊర్కో.... ఊర్కో బాబ్జి!

బాబ్జి: అమ్మ!.... నేనిక్కడే ఉంటానమ్మా!.... మావయ్యగారి ఊరు వెళ్ల నమ్మా.... కొట్టకమ్మా.... అమ్మా!

శాంత: ఏమండీ! ఏమిటండీ! సంధి ప్రేలాపనలా ఉంది! ఎలాగండీ!

సుబ్బ: అదుగో డాక్టరుగారు వచ్చారు!.... డాక్టర్!

డాక్టర్: (వస్తూనే) ఉండండి! పరీక్ష చేస్తాను!

బాబ్జి: ...ఒరేయ్! గాలిపటం పట్టుకోవూ!.... అత్తయ్య!... కొట్టకత్తయ్యా! రవీ!... రవీ!... రవీ!... కొట్టకురవీ!... అమ్మా... మావయ్య గారి ఊరెళ్లనమ్మా!

శారద: డాక్టర్! మా బాబ్జిని కాపాడండి డాక్టర్!... మీకాళ్లు మొక్కుతా డాక్టర్! డాక్టర్!

డాక్టర్: సుబ్బరామయ్యగారూ! ఒక్కసారి యిలా వస్తారా!...

సుబ్బ: చిత్తం!

డాక్టర్: .. సుబ్బరామయ్యగారూ! పిల్లవాడి పరిస్థితి చాలా ప్రమాదంగా ఉంది! వాళ్లమ్మగార్ని త్వరగా పిలిపించండి!... యిదిగో ఈ బిళ్లలు గంట గంటకు వెయ్యండి! వస్తా!

శాంత : ఏమండీ!.... డాక్టర్ ఏమన్నారు?

సుబ్బ : శాంతా!.... మాట దక్కించుకోలేకపోయాను! పిల్లవాడు.... దక్కేలా లేదు!.... యిప్పుడే మా చెల్లెలికి కబురంపి వస్తా!

శాంత : ఆ!.... ఎంతపని జరిగింది! అయ్యో! నా చేతులు పడిపోనూ!.... బాబ్జి! బాబ్జి! పాపిష్టిదాన్ని! క్షమించు బాబూ!.... యిటు చూడు!.... బాబ్జి!.... బాబ్జి!

శారద : అమ్మా!.... బాబ్జి అలా చూస్తున్నాడేమిటే! నాకు భయమేస్తోంది!

రవి : బాబ్జి! నేను రవిని! నన్ను క్షమించు! నాతో మాట్లాడవూ!

బాబ్జి : అమ్మా!.... వచ్చేస్తున్నా!.... అమ్మా!.... మన ఊరు వచ్చేస్తున్నా!.... అత్తయ్య! నేనేం తప్పు చెయ్యలేదు అత్తయ్యా!.... శారదా పాఠం చెప్పవూ!

సుబ్బ : శాంతా! శాంతా! ఎలా ఉంది! మా అక్క సుభద్రకు ఫోను చేస్తే రేపు బాబ్జి పుట్టినరోజని యిక్కడికే బయలేరిందట. వచ్చే వేళయింది.

శాంత : ఏం చెప్పనండి! సంధి ప్రేలాపన ఎక్కువయింది!.... ఏమండీ!.... అటు చూడండీ!.... అదేమిటు! కళ్లు అలా తేలవేశాడేమిటండీ!

సుబ్బ : ఆ! వళ్లు చల్లబడిపోయింది! అయిపోయింది అంతా అయిపోయింది!.... బాబ్జి ఈ లోకాన్ని వదిలేశాడు!

అంతా కలసి : ఆ!.... బాబ్జి!.... బాబ్జి!.... (ఏడుపు)

సుభ : (వస్తూ) బాబ్జి! నేను మీ అమ్మను!.... వచ్చాను!.... తమ్ముడూ! బాబ్జికి ఎలా ఉంది.

సుబ్బ : ఏం చెప్పను అక్కయ్యా!.... బాబ్జి.... (ఏడుస్తాడు)

సుభ : ఆ నాయనా! బాబ్జి నన్ను వంటరిదాన్నిచేసి వెళ్లిపోయావా!.... బాబ్జి! బాబ్జి!.... (పిచ్చిగా నవ్వుతూ).... హ!హ!హ!.... నేను తల్లిని కాదు! రాక్షసిని!.... కన్నకొడుకును పెంచలేక కసాయిల కప్పగించాను.... హ.... హ! చెప్పు!.... తమ్ముడూ! మా బాబ్జి ఏడి!.... మా బాబ్జి ఏడి!.... బాబ్జి .. బాబ్జి!

(తెర) (ఆకాశవాణి సౌజన్యంతో)






పాత్రలు :

రాధ - 7 సంవత్సరాల బాలిక
గోపి - 8 సంవత్సరాల బాలుడు (రాధ అన్న)
మామ్మగారు - రాధా గోపీల మామ్మగారు
మేష్టారు - రాధా గోపీల ప్రైవేటు మాస్టారు
ఆనంద్ - రాధ గోపీల అన్నయ్య - 14 సం॥లు.

(బయట వర్షం, రాధా గోపి హాలులో కూర్చుని పడవలు కట్టుకుంటూ ఉంటారు)

గోపి : ఇవ్వాళ బలేవాన కురుస్తుందిలే !

రాధ : ఈ వర్షంలో మన మేష్టారు రాలేరుగా ! హాయిగా ఈ పడవలన్నీ కట్టి బయట వాననీటిలో వదిలేద్దాం.

గోపి : అదేం కుదరదులే, పిడుగులు పడుతున్నా మన మేష్టారు వచ్చితీర్తారు.

రాధ : నాకీరోజు చదువుకోవాలని లేదు గోపీ !

గోపి : నాకూ చదువుకోవాలని లేదు

రాధ : మరెలాగ ? స్ట్రైక్ చేద్దామా, డౌన్, డౌన్ అని

గోపి : (నవ్వుతూ) వద్దు మన మేష్టారికి కుక్కలంటే భయం. ఆయన రాగానే లిల్లీని విప్పేద్దాం, స్ట్రైక్ కంటే ఇదే సులువు.

రాధ : అది మేష్టార్ని కరుస్తుందేమో !

గోపి : అది అక్కడ భొయ్యిమంటే, ఈయన ఇక్కడ తుర్రుమంటారు. అందుకనే లిల్లీ మేష్టార్ని కరవలేదులే.

రాధ : గోపీ, ఇదిగో గేటు దగ్గర గొడుగు, మన మేష్టారిదే

గోపి : (మెల్లగా) నేను లిల్లీని విప్పివచ్చేస్తాను. నువ్విక్కడే ఉండు.

(గోపి లోపలికి వెళ్తాడు. తెరలో కుక్క మొఱుగులు, మేష్టారు గొడుగు పుచ్చుకొని కుక్కను అదిలిస్తూన్నట్లుగా భయపడుతూ వస్తారు. తెరలో మళ్ళీ కుక్క అరుపులు. మేష్టారు భయపడి లోపలికి పారిపోతాడు. కుక్క అరుపులు, మేష్టారి పరుగులు, పిల్లల నవ్వులు, మామ్మగారు, వస్తారు)

మామ్మ : ఏమిట్రా, ఆ గోల. వట్టి అల్లరిబాజాలు. ఆ మేష్టారెందుకూ అలా పరుగెత్తుతున్నారూ ? లిల్లీ ఎందుకలా అరుస్తూంది? వెంకన్నగాడెక్కడ తగలబడ్డాడూ ? దాన్ని కట్టెయ్యకుండా.

రాధ : మామ్మా, మరేం మన లిల్లీ మేష్టారి కాలుపట్టుకొని కర-

మామ్మ : కరిచేసింది - కాలుపట్టుకునే ? ఉండు, కుక్క కాటుకు చెప్పుదెబ్బ అన్నారు రాధా.

రాధ : కరవ——

మామ్మ : తరువాత చెప్పుదువుగానిలే, ముందు చెప్పిన మాటవిని తొందరగా కుక్క కాటు విషం రక్తంలోకి ఎక్కిపోతుంది పాపం.

(రాధ లోపలికి వెళ్లి బూటు పట్టుకొస్తుంది)

మామ్మ : చెప్పు తెమ్మంటే బూటు తెచ్చావా ? వట్టి అల్లరి బాజా, ఊ సరేలే ఏదైనా ఒకటే మేష్టారేరి ?

(మేష్టారు గొడుగు పట్టుకొని ఖంగారుగా, భయంగా వస్తారు)

గోపి : ఇంక భయంలేదు మేష్టారూ, వెంకన్న కుక్కని కట్టేశాడుగా !

మామ్మ : అయ్యో, పాపం ! కాలిమీద కుక్క కరిచిందా ? ఉండండి. కుక్కకాటుకు చెప్పుదెబ్బ అన్నారు. (అని ఠపీలు మని బూటుతో కాలిమీద కొడ్తుంది)

మేష్టారు : తప్పు తప్పు అయ్యో, నన్ను కుక్క కరవలేదండీ మామ్మగారూ. కొట్టి చంపకండి. అన్నా ! (అని ముక్కుమీద వేలేసుకుంటాడు)

మామ్మ : వట్టి పిరికి మేష్టారు పాపం (అని మళ్ళీ బూటు ఎత్తుతుంది కొట్టడానికి)

మేష్టారు : మామ్మగారూ, మీకు నమస్కారం పెడ్తాను. కుక్క కరవలేదండీ (మామ్మగారు బూటు ఎత్తగానే మేష్టారు లోపలికి పారిపోతాడు)

మామ్మ : వట్టి పిరికి మనిషి పాపం! కాస్త ఓర్చుకోండి

(అని బూటుతో ఆయనను వెంబడిస్తుంది. ఇలా రెండు సార్లు తిరిగాక మేష్టారు తివాచీమీద కూలబడతారు ఆయాసపడుతూ)

మామ్మ : ఆ అదీ, అలా బుద్ధిగా కూర్చోండి (అని బూటు ఎత్తబోయి) వట్టి అల్లరి రాజా! చెప్పు తేవే అంటే బూటు తెచ్చింది. చెప్పు తెస్తాను. (లోపలకి వెళ్తూ) రాధా, గోపి. మేష్టార్ని జాగ్రత్తగా చూస్తూ ఉండండి పాపం.

లోపలనుంచి మామ్మ : అయ్యో, తేలు, తేలు, కుట్టిందర్రోయ్ అని వచ్చి కూలబడుతుంది)

రాధ : ఎక్కడ కుట్టింది మామ్మా,

మామ్మ : ఇక్కడా (అని వేలు చూపిస్తుంది) చెప్పుతీయ బోతుంటే చటుక్కున కుట్టింది. ఇంతపెద్ద ఎర్రతేలు చటుక్కున కుట్టింది. ప్రొద్దున లేచి ఎవరి మొహం చూశానో ఏమో! అయ్యో. అయ్యో (బాధపడుతుంది)

మేష్టారు : (లేచి) హమ్మయ్య! బ్రతికాను. రక్షించారు. అయ్యో! పాపం మామ్మ గారికి తేలుకుట్టింది, అన్నా! ముక్కుమీద వేలేసుకుంటాడు)

మామ్మ : పుణ్యానికి వెళ్తే పాపం ఎదురైంది. ఈ మేష్టారిని కుక్క కరిచిందికదా అని—

రాధ : మేష్టారిని కుక్క కరవందే.

మామ్మ : కరిచిందన్నావుగా నువ్వు

రాధ : ఊహూ కరవడానికి వచ్చిందంటే కరిచిందని నువ్వే బూట్లూ చెప్పులూ, పట్టుకొని తిరిగావు (నవ్వుతుంది)

మామ్మ : ఇంతకీ మేష్టార్ని కుక్క కరవలేనేలేదు? వట్టి అల్లరి బాజా! అయ్యో అయ్యో, పట్టి పుణ్యానికి నాకు తేలు కుట్టింది కర్మ అయ్యో. అయ్యో. ప్రొద్దున్నేలేచి ఎవరి మొహం చూశానో ఏమో? అయ్యో అయ్యో విషం ఎక్కిపోతుందో ఏమో?

గోపి
రాధ } (నవ్వుతారు)

మేష్టారు : తప్పు, తప్పు, అన్నా ! (అని ముక్కుమీద వేలేసుకొని) ఫరవాలేదు, మామ్మగారూ, గాంధీగారి వైద్యం చేస్తే, తేలు బాధ నిమిషంలో తగ్గిపోతుంది. చూశారా, ఈ సీసా నా దగ్గిర ఎప్పుడూ ఉంచుతాను. (అని జేబులోంచి చిన్న నీళ్లసీసా తీసి చూపిస్తాడు)

మామ్మ : (బాధపడుతూ) గాంధీ వైద్యమో, నెహ్రూ వైద్యమో, ముందు విషం ఎక్కిపోకుండా ఏదో ఒకవైద్యం - విషం ఎక్కిపోయిందో ఏమో : ఖర్మ అయ్యో, అయ్యో.

మేష్టారు : అన్నా ! (ముక్కుమీద వేలేసుకొని) గోపి, చిటికెడు పసుపు తెచ్చిపెట్టమ్మా.

(గోపి వెళ్తాడు)

మామ్మ : ఉపకారానికి వెళ్తే అపకారం ఎదురైంది, అయ్యో, అయ్యో, ఆ నెహ్రూ వైద్యమో, గాంధీవైద్యమో అదీలేదు - ఏమిటో, ఉప్పూ, పసుపు అంటూ ఖర్మం ఏం మేష్టారో - అయ్యో, అయ్యో విషం ఎక్కిపోతుందో ఏమో.

(గోపి పసుపు తెస్తాడు. మేష్టారు కాగితంలో ఉన్న పసుపుని నీళ్ళ సీసాలో వేస్తారు. వేసి సీసా బాగా కదిలిస్తాడు)

మేష్టారు : మామ్మగారూ కొంచెం కళ్లు పైకెత్తండి. రెండు చుక్కలు కంట్లో పోస్తాను (కంట్లో పోస్తాడు)

మామ్మ : అమ్మ బాబోయ్ ! చచ్చాను. మంట మంట కంట్లో కారంనీళ్లు ! మంట మంట ఇదేం గాంధీవైద్యం నాయనా !

మేష్టారు : కొంచెం ఓర్చుకోండి, మామ్మగారూ, తగ్గిపోతుంది.

మామ్మ : మంట మంట.

(ఆనంద్ వస్తాడు)

ఆనంద్ : అదేమిటి మామ్మా ?

మామ్మ : ఈ మేష్టారు నా కంట్లో కారం పోశారు నాయనా ! ఎవరి మొహం చూశానో ఏమో ! ఇంత పెద్దతేలు కటుక్కున కుట్టింది. ఏదో గాంధీ వైద్యమో, నెహ్రూ వైద్యమో అంటూ, అయ్యో అయ్యో, విషం ఎక్కిపోతుందో ఏమో !

ఆనంద్ : అదేమిటి మేష్టారూ, కంట్లో కారం నీళ్లు పోయటం ఏమిటండీ?

మేష్టారు: తప్పు, తప్పు. కంట్లో కారం నీళ్లు పోస్తానటయ్యా, అన్నా! (వేలు ముక్కుమీద వేసుకొని) ఉప్పు కరిగిన నీళ్లు కంట్లో పోస్తే తేలు బాధ తగ్గుతుందని గాంధీగారు చెప్పారని ఎందులోనో చదివాను. నా దగ్గరున్న సీసాలో ఉప్పు నీళ్లు నిలువవు కదా! చిటికెడు పసుపు కలిపితే మంచిదని మీ వంటావిడ నడిగి కాస్త పసుపు గోపిచేత తెప్పించి నీళ్లసీసాలో కలిపి మామ్మగారి కళ్ళల్లో పోశాను. పసుపు అన్నింటికి మంచిదని అదీ ఎందులోనో చదివాను. అంతే. కారం నీళ్లుపోస్తానా? తప్పు తప్పు-అన్నా!

ఆనంద్ : (గట్టిగా నవ్వుతూ) సరిసరి, ఇంకేం అంతా తెలిసిపోయింది మేష్టారూ. మీరు గాంధీవైద్యం చెయ్యడానికి మా వంటావిడ దగ్గిర పసుపు తెప్పిస్తే మీ చెవిటి చత్వారం వంటావిడ శాస్త్రిగారి వైద్యం చేసేసింది (మళ్ళా నవ్వుతాడు)

మేష్టారు : శాస్త్రిగారి వైద్యమేమిటో? వంటావిడ ఏమీ వైద్యం చెయ్యందే, అస లావిడ ఇక్కడకు రాలేదుగా, నేనేగా మామ్మగారి కంట్లో ఉప్పునీళ్లు పోసింది.

ఆనంద్ : (నవ్వుతూ) మా వంటావిడ వంటింట్లోంచే మా మామ్మకు వైద్యం చేసింది. ఆ చత్వారం మనిషి పసుపే అనుకొని కారం యిచ్చింది. సందేహంలేదు.

మామ్మ : అంతే. అంతే. అప్పడాలు చేద్దామని సీమ మిరపకాయల కారం కొట్టించి పసుపు డబ్బా ప్రక్కగా అలమార్లో పెట్టాను. నా ప్రాణానికి ఆ చత్వారం మొద్దు పసుపే అనుకొని సీమ మిరపకాయల కారం యిచ్చిందన్నమాట. అయ్యో, అయ్యో ఇదేం వైద్యమో.... నానెత్తి వైద్యమూ. మంట మంటా! ఖర్మ.

మేష్టారు : ఎంత పొరపాటైపోయింది. తప్పు, తప్పు క్షమించండిమామ్మగారూ. అన్నా! (ముక్కుమీద వేలేసుకొని) లేచినవేళ మంచిది కాకపోతే నాకు చెప్పు దెబ్బలూ మీకు కంట్లో కారం నీళ్లూను. తప్పు తప్పు అన్నా!

ఆనంద్ : ఇంతకీ తేల్నయినా చంపారా? లేదా?

మామ్మ : ఈ గాంధీ వైద్యంతోనే సరిపోతే తేలుని చంపిన వాళ్ళెవరూ? అయ్యో. అయ్యో!

ఆనంద్ : ఈ పాటికి ఆ తేలెక్కడికో పారిపోయే ఉంటుంది. కాని, అయినా వెళ్ళి చూసివస్తాను.

(లోపలికి వెళ్లి తిరిగి వస్తాడు)

**ఆనంద్ :** (పకపకా నవ్వుతూ) మామ్మా, ఇదిగో నిన్ను కుట్టినతేలు.

(మామ్మగారి మీదికి విసురుతాడు)

**మామ్మ :** (లేచి గంతులువేస్తూ) నీయిల్లు బంగారం కానూ, అదేం పనిరా, వట్టి అల్లరి బాజావురా. తేలు తెచ్చి మీద పడేస్తావూ. అసలే చస్తూంటేను. విషం ఎక్కిపోయిందో ఏమో.

**ఆనంద్ :** అది నిజం తేలు కాదు మామ్మా, తేలుబొమ్మ. రాధా గోపి ఆడుకొని అక్కడ పారేసుంటారు. ఇది చూసి నిజం తేలనుకుంది మామ్మ.

**మేష్టారు :** అయితే, ఇంతకీ మామ్మగారికి తేలు కుట్టలేదు. అన్నా (ముక్కు మీద వేలు) మరి, ఏదో చిటుక్కున కుట్టింది. కటిక్కున కరిచిందని బాధ పడ్డారు పాపం.

**ఆనంద్ :** (నవ్వుతూ) జోళ్ళ స్టాండు దగ్గరున్న కండచీమలు కుట్టాయి. అక్కడ పెద్ద కండచీమల బారుంది (అని నవ్వుతాడు)

**మామ్మ :** తేలు కుట్టందే గాంధీ వైద్యమా ? కర్మ ! అయ్యో రాతా !

**మేష్టారు :** కుక్క కఱవందే చెప్పుదెబ్బలు. అన్నా ! (ముక్కు మీద వేలు)

**మామ్మ :** పుణ్యానికి వెళ్తే పాపం ఎదురైంది.

**మేష్టారు :** లేచిన వేళ !

**ఆనంద్ :** (నవ్వుతూ) మామ్మని మించిన వైద్యం మేష్టారుదీ. మేష్టారుని మించిన వైద్యం మామ్మదీను - ఒకర్ని మించిన వైద్యులు ఇంకొకరు.

**రాధ :** వట్టి అల్లరి బాజాలు

**గోపి :** తప్పు తప్పు అన్నా !

(ముక్కుమీద వేలేసుకుంటాడు, అందరూ నవ్వుతుండగా)

(తెర)






పాత్రలు :

| | |
|---|---|
| సుధ | మధు |
| రాధ | ఉమ |

అదొక చిన్న హాలు- సోఫాలు, కుర్చీలు, చిన్న టేబులు, వాటిమీద పత్రికలు, పుస్తకాలు వుంటాయి. సుధ, మధు మొదలైనవాళ్లు మాట్లాడుకొంటూ వుంటారు.

సుధ : అయాం సారీ ! ఇలా అవుతుందనుకోలేదు

మధు : ఇప్పుడేం కొంపమునిగింది ?

సుధ : పాపం హరీ అంది.

రాధ : బహుశా ఎవరో ఎవర్నో ఆ పేరుతో పిలిచి ఉంటారు.

సుధ : నీ తలకాయ! చెప్పకుండా చెయ్యకుండా పరమపదం ఎక్కి కూచుంటేను!

రాధ : ఓహో ! పాములూ నిచ్చెనలు ఆట ఆడేరా ? ఎవరు ? ఎప్పుడు?

మధు : ఆ చెప్పేదేదో చెప్పనీయ కుండా మధ్య అడ్డు ప్రశ్నలు వెయ్యకు !

రాధ : నాకెందుకు? నేను నోరుమూసుకుంటాను. మీరిద్దరూ చెప్పుకొండి.

సుధ : నేను చెప్తున్నది నీ ఆరాధ్య దేవత గురించేనోయ్

మధు : హాయ్ సుధా. ఎప్పుడు చెప్పావుకాదే, రాధకో బోయ్ ఫ్రెండు ఉన్నాడని?

రాధ : మీ కందరికీ మతులుపోతున్నాయా ? నాకేమిటి ? బోయ్ ఫ్రెండేమిటి ?

మధు : ఏం ! ఉండే వయసుకాదా ? ఉండకూడదా ? ఉంటే తప్పా ?

రాధ : సుధ చెప్పింది బాగా విన్నావా ? హరీ అన్నాడు అనలేదు, హరీ అంది.

సుధ : ఇంతకీ నన్ను చెప్పనిస్తారా? లేకపోతే ఇలాగే వాదులాడుకుంటూ ఉంటారా?

మధు : చెప్పు.

సుధ : పాపం కొంతంగారు కన్నుమూశారట.

రాధ : కొంతంగారు పోయారా ? ఆవిడ రచనలంటే పడిచస్తానుకదా ! అంతటి మహా రచయిత్రి మరణించడమంటే మాటలా ? సుధా ! నిజమే చెప్తున్నావా ?

సుధ : నీతో అబద్ధం చెప్పవలసిన అవసరం నాకేమిటి రాధా !

మధు : ఇంత చిన్న వయసులోనే ఇన్ని వందల రచనలు చేసి పఠితల గుండెల్లో గాయాలుచేశారు ! పాపం పోయారంటే నా గుండెల్లో కూడా గుబ్బాలు పరిగెడుతున్నాయి.

రాధ : ఎవరు మాత్రం ఏంచేయగలరు చెప్పు ! ఆ మరణించిన మహా రచయిత్రి ఆత్మశాంతి కోసం అశ్రుధారలతో శ్రద్ధాంజలి ఘటించి మన కృతజ్ఞత వెల్లడించుకోవాలి. చందాలు వసూలు చేసి అయినా వారి రచనలు ముద్రింపించాలి.

సుధ : నాకు మాటల్లో నమ్మకంలేదు. చేతల్లో చేసి చూపించాలి.

మధు : పోనీ, అలాగే చేసి చూపిద్దాం. ఏంచేస్తే బావుంటుందో నువ్వే చెప్పు.

రాధ : మనం అందరినీ పిలిచి సాయంకాలం సమావేశ పరిచి కొంతంగారి మరణానికి సంతాపసభ ఏర్పాటు చేయాలి. మనకి తోచిన నాలుగు ముక్కలూ చెప్పేసి, ఓ తీర్మానాన్ని పాస్‌చేసి దాని సారాంశాన్ని పత్రికలకి పంపిస్తే రేపు పొద్దున కల్లా పత్రికల్లో వచ్చేస్తుంది. ఉభయతారకంగా ఇటు మన పేర్లూ పేపర్లలో పడతాయి. అటు మన కృషిని నవకవిలోకం సహర్షంగా సమర్థిస్తుంది.

సుధ: కాంతంగారి ఆత్మకూ శాంతి లభిస్తుంది. ఈ మాటే శోభకు కూడా చెప్పాను.

ఉమ: (ప్రవేశిస్తూ) నమస్కారమండీ, మధూగారంటే?

మధు: సుప్రభాతం, నేను మధులతని.

ఉమ: నాకు?

మధు: సుధ, రాధ, నాక్లాస్ మేట్స్, బెంచిమేట్స్ రూంమేట్స్ అన్నీను.

సుధ: మేడ మెట్లు మాత్రంకాదు.

మధు: చెప్పండి ఫరవాలేదు. మనకి కావలసినవారే. యువకవిత్రయంలో వాళ్లూ ఉన్నారులెండి వెరసి ముగ్గురం.

ఉమ: అయితే మరీమంచిది. చెప్పారుకాదేం?

మధు: ఇప్పుడే చెప్పాను కదాండీ!

ఉమ: మరేం లేదు. మీవల్ల ఓ చిన్న సహాయం కావల్సి ఇలా వచ్చాను.

మధు: అలాగా! అయితే ఇప్పుడేవస్తాం సుధా, రాధా, ఇలారండర్రా.

సుధ: (మెల్లగా) ఏమిటే! ఎందుకలా కొంపలంటుకుపోయినట్టు పిలిచేవు?

మధు: ఏంలేదు. ఒక్క విషయం. మన నాన్నలు బాగా ఉన్నవాళ్లని ఊళ్ళో అందరికీ తెలుసు.

రాధ: నువ్వే టాంటాం చేశావు.

మధ: పోనీ అలాగే అనుకో

సుధు: ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే

మధు: ఆ వచ్చినావిడ ఉంది చూశావూ, చేతిలో పుస్తకాలూ వ్యవహారమూను! నా కేదో అనుమానంగా ఉంది.

రాధ: అంటే?

సుధ: ఏముంది? ఆవిడా స్టూడెంటే నన్నమాట.

మధు: అబ్బ. నేను చెప్పేది వినండర్రా. ఇలాంటివాళ్లు తెల్లారిలేస్తే తొంభైమంది వస్తారు, ఏ సంఘాలూ సమాజాలూ పెట్టామనో, ట్యూషన్ ఫీజుకి డబ్బులు లేవనో, పరీక్ష ఫీజుకి డబ్బులు చాలవనో ఏదోవంక పెట్టి వసూలు చేసుకుపోతారు.

సుధ : ఒట్టి అనుమానపు పక్షివి. ఏదో, గుమ్మంలోకి వచ్చారుకదా, నాలుగు మాటలు మాట్లాడి పంపివేస్తే బావుంటుంది. అక్కడావిణ్ణి ఒంటరిగా చతికిల పడమని, ఇక్కడ ముసుగులో గుద్దులాట ఏం బావుండదు.

మధు : సారీ! మిమ్మల్ని అలాగే కూర్చో బెట్టేశాం

ఉమ : ఫరవాలేదులెండి. పనిమీద వచ్చిన వాళ్లకి పరుగుపందెంలో లాగ ఆత్రం ఎక్కువైతే అసలుకే మోసం

మధు : మీరేదో చెప్పబోయారు, ఇందాక ?

ఉమ : ఏం లేదులెండి. ఓ చిన్న పనుండి వచ్చాను.

రాధ : చల్లకొచ్చి ముంతదాచడం ఎందుకు ? చెప్పండి ?

ఉమ : నేనూ రచయిత్రిని

సుధ : అసలు మేం ఇంతవరకూ చర్చించుకుంటున్నదికూడా రచయిత్రులగురించే

మధు : ఇంతకీ వారొచ్చిన పని చెప్పనిస్తారా లేదా ?

ఉమ : ముందే మనవి చేసుకున్నాను, నేనొక రచయిత్రినని.

సుధ : నేనూ ముందే మనవిచేసుకున్నాను, మిమ్మల్ని చూడగానే అలాగే అనిపించారని,

మధు : నువ్వు కాస్త నోరు మూసుకుంటావా ?

సుధ : నాకేమీ అభ్యంతరం లేదనుకో. ఒకసారి నోరు మూతపడిందంటే మళ్ళీ తెరువమని తల్లక్రిందులా తపస్సుచేసినా తెరువను.

రాధ : ఫరవాలేదు. ప్రమాదమైనా తప్పుతుంది.

ఉమ : ప్రమాదంపోయి ఆనందం కాలెట్టింది.

మధు : కాబట్టి మాకు ఆనందసందేశం ఇచ్చిపోతారన్నమాట

ఉమ : నేనో రచయిత్రినని ముందే మనవి చేసుకున్నాను.

సుధ : ఆమాట ఇంతవరకూ మూడుసార్లు మనవి చేసుకున్నారు. మరేదైనా చెప్పండి. లేకపోతే అరిగిపోయిన రికార్డులాగా ఉంటుంది.

రాధ : పుస్తకాలేమైనా వ్రాశారా ?

ఉమ : నాటకాలు, కథానికలూ, గేయాలు చాలానే వ్రాశాననుకోండి.

మధు : నేను ముందే అనుకున్నాను. నా ఊహలు ఎప్పుడూ తప్పుకాదు.

సుధ : ఏమిటో ఆ ఊహ

మధు : నాన్సెన్స్

సుధ : ఇప్పుడు బాగా అర్థమైంది. వారేం చెప్పుకున్నా చెప్పుకో అని, ఆచెవిలోంచి విని ఈ చెవిలోంచి వదిలేయడం. దేనికీ సమాధానం చెప్పకుండా ముంగి లాగ మూతి పెట్టుకుని కూర్చోవటం, అంతేనా ?

మధు : నేను సైలెన్సన్నది నిన్ను మాట్లాడవద్దని

ఉమ : మీరిలాగ కీచులాడుకుంటూ నా ఓర్పును పరీక్షిస్తున్నారు.

రాధ : ఇది వాళ్లకి ఎప్పుడూ మామూలేలెండీ. ఒకడు పగటిచుక్క, ఇంకొకరు రేచుక్క

సుధ : ఆ మిగిలిన మూడోవాడు తోకచుక్క

ఉమ : నేనా ?

మధు : ఛ ! ఇప్పుడు చెప్పండి.

ఉమ : నేనొక రచయిత్రినని ముందే మనవి చేసుకున్నాను. నాటకాలూ, కథలూ గేయాలూ చాలానే వ్రాశాననుకోండి.

సుధ : వాటినన్నింటినీ హాయిగా తలోటి ఇస్తే మీపేరు చెప్పి చదువుకునే వాళ్లం కదా ?

ఉమ : పత్రికల్లో వచ్చినన్ని వచ్చాయనుకోండి. మిగిలినవి కట్టలు కట్టి ఇంట్లో పెట్టేశాను.

రాధ : సుమారు ఎన్నేళ్లయి ఉంటుంది.

ఉమ : అబ్బా ? చాలా కాలమే అయింది ఈ వ్యాపారం మొదలెట్టి

సుధ : బలేవారే ! కాగితాలు కట్టలు కట్టి ఇంట్లో పెట్టుక్కూచోవడం వ్యాపార మటండీ ఈపాటికి అవి చెదలు పట్టే ఉండాలే ?

ఉమ : మీ ధర్మమా అని ఇంకా చెదలు పట్టలేదు.

మధు : బహుశా ఆ కట్టల మధ్య హారతి కర్పూరపు ఉండలు పెట్టి ఉంటారు. చూశారా, ఎంత కరెక్టుగా చెప్పేశానో !

ఉమ : అవి అలా ఇంకొంతకాలం ఉంటే చెదలేపడతాయో, ఎలకలే కొట్టేస్తాయో. చెప్పలేం కదండీ. అందుకని.

రాధ : మరి చెప్పకండి.

సుధ : ఆ తర్వాతది మేమే చెప్పేశాం.

మధు : ఏమిటోయ్, నువ్వు చెప్పేది?

సుధ : ఏముంది? వారు కట్టలు కట్టిపెట్టిన రచనలన్నీ ప్రింటుచేయించుకోవాలని ఇంతకాలానికి బుద్ధిపుట్టి ఉంటుంది. అందువలన వాటిని వెలుగు తేవాలంటే మనలోంచి సాహితీ పరులను, సాహితీ ఉపాసకులను ఎవర్నయినా పట్టుకొని చందాలు వసూలుచేసి అచ్చుకొట్టించుకోవాలని అనుకొని ఉంటారని నా అనుమానం.

మధు : మొత్తానికి కొండను తవ్వి ఎలకను పట్టావ్! నిజంగా నీ తెలివి తేటలకు మా జోహార్లు. కాని, ఏమండీ! ఒక ప్రముఖ రచయిత్రి అమూల్య రచనలను సేకరించి పుస్తకం ప్రింటు చేయించి ఆమెను కీర్తిశేషురాలిని చేయాలని మేం మీరు రాకముందే నిర్ణయించుకున్నాం

ఉమ : సాహిత్యం అన్నా, సాహిత్యవేత్తలన్నా మీకున్న అభిమానానికి నేనెలా నా ఆనందాన్ని వ్యక్తం చేయాలో తేలీటంలేదు.

రాధ : ఇంతకీ మీపేరేమిటన్నారు?

ఉమ : ఉమండి. నేనొక రచయిత్రినని ముందే మనవిచేసుకున్నాను. నాటకాలూ కథలూ గేయాలు చాలానే వ్రాశాననుకోండి. కొన్ని పత్రికల్లో వచ్చాయి. చాలా రచనలు కట్టలుకట్టి ఇంట్లో పెట్టేశాను. ఇంతకీ నేను చెప్పబోయేది.

సుధ : మీరొక రచయిత్రి. నాటకాలూ కథలూ గేయాలూ చాలానే వ్రాశారు. కట్టలు కట్టేసి ఇంట్లో పెట్టేశారు. నాటికినేడు చెదలరూపేణానో, ఎలకల రూపేణగానో వాటికి నివృత్తి కలిగే అవకాశం వచ్చింది. అందువల్ల. ...

రాధ : ఆ తర్వాతి విషయం వారు చెప్పందే?

మధు : చెప్పకముందే ఊహించుకోవడం తెలివైన వాళ్ల లక్షణం

ఉమ : ఒక్కమీరే ఏమిటి? కలం పట్టిన వారికథే అంత!

సుధ : అవునవును. ఇంగ్లీషులో 'బీటింగ్ అబౌట్ ది బుష్' అంటారు. తెలుగులో 'గాలి పోగుచేయడం' అంటారు. అచ్చం అలాగే ఉంది వీరి వైఖరి. ఉండీ, ఉడిగీ ఒక్కొక్కమాట బయట పెడుతున్నారు. ఇది నిజంగా సుకవి లక్షణం.

మధు : లక్షణంగా చెప్పావు.

ఉమ : నేను మీరంతా ఊహించుకుంటున్నంత గొప్పకవయిత్రిని కాకపోవచ్చును. కాని కొద్దోగొప్పో రాసిన ఘటాన్నే.

సుధ : అయితే మేం రసజ్ఞులమన్నమాట. 'మేం'అంటే మీ పాఠకులం. అందుకే ఎవరో అన్నారు. కవితాకన్య రసజ్ఞత కవి కన్నను సరసుడెరుగు అని.

మధు : చిన్న కరెక్షన్. ఆమాటకొస్తే నీలో రసజ్ఞతకంటే సరసతే ఎక్కువగా ఉండాలే.

ఉమ : లేదామరి !

సుధ : ఇప్పుడు చెప్పండి. ప్రతిదానికి బ్రేకులేనా ? చెదలు పట్టిగాని, ఎలుకలు కొట్టి గాని సర్వనాశనమై పోయే మీ రచనల కట్టల్ని చక్కని పాతకాగితాల దుకాణం చూసి అమ్ముకోవాలను కుంటున్నారు. అంతేనా ?

ఉమ : అదీ మీరే నిర్ణయం చెయ్యండి.

రాధ : మొత్తానికి అసలు విషయం పట్టేశావు సుధా !

సుధ : యూమైకరెక్ట్ ! అందుకు నాలుగు రాళ్లు ఎక్కువిచ్చే దుకాణాన్ని పరిచయం చెయ్యవలసి వచ్చారు. అవునా.

ఉమ : సాధారణంగా మీ రచనలన్నీ తూకం వేసే దుకాణం ఏదో ఒకటి ఉంటుందిగా మరి.

మధు : అలా ఎందుకనుకోవాలి ?

సుధ : ఇంకెలా అనుకోవాలి ?

మధు : వచనం కాని రచనల్ని వారు పదిమందిలోకీ తేవాలనుకొంటున్నారేమో

రాధ : అదీ ఒకందుకు మంచిదే. ఒకందుకు చెడ్డదీ కూడాను.

ఉమ : ఏదిమంచో, ఏదిచెడ్డో, ఏది మాయో తేలడంలేదు.

రాధ : ఇదేమిటి వానలేని ఉరుములాగా ఒక్కసారే వేదాంతంలోకి దిగారు ?

ఉమ : ఇది వేదాంతంకాదు, వేదన, ఆవేదన.

మధు : మరోలా అనుకోకండి, మీ రచనలు ప్రింటు చేయడమంటే పది మంది చదువుతారు, మీరన్నట్టుగా అంతేకాని, పది మందిలోకి తేవాలనుకొని బయట పారేస్తే మాత్రం తలొకటీ ఏరుకొని దానిమీద మీపేరు కొట్టేసి తమ పేరు రాసుకుని ప్రచారం చేసుకుంటారు.

ఉమ : అంతటి గ్రంథచోరులుంటారని నేననుకోను.

సుధ : మేం చెప్పేది సొంగులేనిమాటకాదండీ. దొంగలమాట! ఇంగ్లీషులో చెప్పాలంటే కాపీరైటు లేని కాపీరైటర్సుమాట.

మధు : అందుకని, చక్కగా ఏ పబ్లిషరునో పట్టుకొని ప్రింటు చేయించుకుంటే పుణ్యమూ పురుషార్థమూ రెండూ మీకే దక్కుతాయి.

ఉమ : ఇవన్నీ ఇంతకు ముందే వారపత్రికల్లోనూ, పక్ష పత్రికల్లోనూ, మాస పత్రికల్లోనూ, ఇంకా చెప్పాలంటే దినపత్రికల్లోనూ ఓ చూపు చూసినవే. వాటిని ప్రింటు చేయాలంటే అదోపెద్ద సమస్యకానేకాదు. అందుకు ఎవరో ఒకరు ముందుకు రానేవస్తారు.

రాధ : ఆమాట ముందే చెప్పరేం? మా ఆలోచనలన్నీ పరిపరివిధాల పోయాయంటే నమ్మండి.

సుధ : ఇంతకీ రచయిత్రిగారూ, మీ రచనలన్నీ ఉమా అనేపేరుతోనే వ్రాశారా? మాకు ఎక్కడా చదివినట్లు గుర్తురావటం లేదు. అందుకనీ....

ఉమ : లేదు. నన్ను తెలిసినవాళ్ళంతా నన్ను ఉమ అనే పిలుస్తారు. నా పూర్తి పేరు మావాళ్ళెవరూ వాడరు. సాధారణంగా నేను చేసే రచనలన్నీ నా రెండోపేరుతోనే అచ్చు అవుతుంటాయి. అది నా అర్ధాంగి.

సుధ : అలా చెప్పరేం మరి। మీ కలంపేరు మహేశ్వరికదూ! మేం ముందే ఎక్స్‌పెక్ట్ చేశాం.

ఉమ : మరీ అంతపెద్దదైతే ఏం బావుంటుంది చెప్పండి?

రాధ : సుధ ఊహ కరెక్టుకాదని నాకెప్పుడో తెలుసు. మీ కలంపేరు గాయత్రి. ఇందులో సందేహం లేదు. మీరు కాదనరని నాకు తెలుసు.

ఉమ : మరీ అంత బలవంతం పెట్టేయకండి. పప్పులో కాలేశారు.

మధు : అర్ధాంగి అని చెప్పానుగా. అంటే ఉమలాగ అదీ రెండక్షరాల పేరు. అంతేనండి?

ఉమ : అంతే,

మధు : అర్థదీ! మీ కలంపేరు బాల

ఉమ : కాదు.

సుధ : రాణి

ఉమ : కాదు

రాధ : వాణి

ఉమ : కానేకాదు

మధు : ఏపేరు చెప్పినా కాదనేస్తున్నారు. లాస్ట్‌ఛాన్స్. మీ కలంపేరు 'కలం'

ఉమ : ఆపేరుతో రచనలు మీరెప్పుడైనా చదివేరా ?

సుధ : చదివితే మిమ్మల్ని అడగడం ఎందుకు ? ఆపేరు మీరు చెప్తేనే అందంగా ఉంటుంది.

ఉమ : కాంతం అనేపేరుతో వ్రాస్తుంటానండి. అది మావారి పేరులో భాగం.

మధు : ఏమిటీ నన్నేన్ను ? చంపేస్తున్నారు. మీరు కాంతంగారా ?

రాధ : కాంతంగారు మీరేనా ?

మధు: ఈమాట మీరు ముందే చెప్పగూడదటండీ, మాకు శ్రమ తప్పించేవారు అయ్యేవారుకదా !

రాధ : అంతగొప్ప రచయిత్రి. మీ కాళ్ళను మాకండ్లకు అద్దుకునేవాళ్ళం.

ఉమ : అంతమాట ఎందుకులెండి. అంతమాత్రం అభిమానం ఉంచేరు చాలు.

సుధ : కాకపోతే మీరేమిటండీ, ఇంతపెద్ద రచయిత్రి కాంతంగారు చెప్పాపెట్ట కుండా అమాంతం ఇలా ఊడిపడతారని కలగంటారండీ.

మధు : ఇప్పటిదాకా మాగుండెల్లో గుఱ్ఱాలు పరిగెత్తేయి, మీకేం తెలుసు ?

ఉమ : మీకు రేసులంటే బాగా ఇష్టమా ?

సుధ : మీరు మహీనండీ ! ఇంతవరకూ మీ అకాలమరణానికి విచారించి చస్తుంటే మీరలా తీసిపారేస్తారేమిటండి.

ఉమ : నేను బతికే ఉన్నాను. చావలేదు.

మధు : చావలేదంటారేమిటండీ, లోకం అంతాకోడై కూస్తుంటేనూ ?

ఉమ : అబద్ధం ఎందుకు ? చచ్చాను.

రాధ : అలా ఒప్పేసుకోండి.

ఉమ : గుర్తింపులేని రచయిత్రిగా ఇంతకాలమూ నేను చచ్చినదానికిందే లెక్క, ఇప్పుడిప్పుడే నాకూ ఒక గుర్తింపు అంటూ వచ్చింది. కాబట్టి మళ్ళా బతికేసు.

సుధ : ఏదో దయ్యాలకథలా ఉంది.

మధు : ఇంతవరకూ మేంచేసిన ఏర్పాట్లన్నీ వృధాయేనన్నమాట.

ఉమ : ఏమిటో నేనూ వినవచ్చా ?

సుధ : తప్పకుండా. మీరు మరణించారన్నవార్త వినగానే మాకు దుఃఖం కట్టలు తెంచుకుంది.

రాధ : ఇవాళ సాయంకాలం కిసానిగుల్లో సంతాపసభకూడా ఏర్పాటు చేయాలనుకున్నాం.

ఉమ : నేను బతికే ఉన్నాను బాబోయ్ అంటే నమ్మకం....

మధు : ఏవండోయ్ ! వేళాకోళానికికూడ ఒక హద్దూ పద్దూ ఉండాలి.

సుధ : కాంతం పేరుతో కథలు అవీ వ్రాసేది మీరేనా ! మంచివారని....నిర్ధారణ అయింది. ఇప్పుడు కాదంటే ఎలా ?

రాధ : చందాలు వసూలు చేసైనా మీరచనల్ని ముద్రించాలని అనుకుంటూ ఉన్నామే ? మా శ్రమ అంతా వృథాయేనా ? మీరు ఆలోచించాలి.

ఉమ : మీరు పేపరు సరిగా చూసి ఉండరు. చనిపోయింది 'కాంతం' అనే హిందీ రచయిత్రి. నేను 'కాంతం'

మధు : చంపేశారు పొండి, ఆసున్నా ఇంత పనిచేసిందన్నమాట.

ఉమ : పోనీలెండి. మీరు నాకంటె చిన్నవారే అయినా, నాపేరు మీద ఉండే గౌరవం మిమ్మల్ని నిజంగా ఈ మంచి నిర్ణయాన్ని తీసుకునేట్టు చేసింది. నా ముఖమైనా తెలియని మీరు, నిజంగా నారచనలకి ప్రాణంపోసి పుస్తక రూపంలో వెలువరించాలనుకున్నారంటే నాకంతకంటే కావలసిందేముంది? ఇంతకీ నే వచ్చినపని చెప్పనేలేదుకదూ.

సుధ : పోనీ, ఇప్పుడు చెప్పండి.

ఉమ : మరేంలేదు. నాకు తెలిసిన పబ్లిషర్ ఒకాయన నా రచనల్లో కొన్నింటిని ఒక వ్యాసంగా ప్రచురించడానికి అంగీకరించారు.

మధు : చాలా సంతోషమండి ! మేం చేయాలనుకున్న పనే వారు చేయాలను కున్నారు.

ఉమ : అప్పుడే చేశారు కూడా

రాధ : ఏమిటి ? మాకంటే ముందుగానే ?

ఉమ : పుస్తకం మాత్రం మూడువందల పేజీలతో మూడు రంగుల ముఖ చిత్రంతో బ్రహ్మాండంగా వచ్చింది.

సుధ : అప్పుడే ? ఆవిష్కరణ ఎక్కడ చేయిస్తున్నారు? ఎప్పుడు? మాకు తెలియ పరిస్తే మేం తప్పకుండా వస్తాం.

ఉమ : ఆదేం పెట్టుకోదల్చుకోలేదు. ఆయన నాకిచ్చే రాయల్టీ రొఖ్ఖం రూపంలో ఇవ్వకుండా అందుకు బదులు రెండు వందల కాపీలిచ్చాడు.

మధు : మీరు వచ్చిన పనేమిటో ఇప్పటికైనా మాకు తెల్పిందంటారా ?

ఉమ : తెలిసే ఉండాలి. అన్ని కాపీలు నేనేం చేసుకోను చెప్పండి !

రాధ : మేం మీ అభిమానులమని మీకు తెలుసు

ఉమ : అందుకే మీదాకా వచ్చాను. మీరు సంతాపసభ ఏర్పాటు చేసుకొన్నారని విని మీ అభిమానానికి కృతజ్ఞత చెప్పుకోవాలనిపించింది.

మధు : అయితే శోభ చెప్పేసి ఉంటుంది.

ఉమ : అవునండి. ఆవిడే చెప్పారు. ఆవిడకీ ఒక కాపీ ఇచ్చాననుకోండి.

సుధ : అవును, రెండువందల కాపీలు మీరేం చేసుకుంటారు ?

ఉమ : అందుకే నా అభిమానులందరికి తలోకాపీ ఇచ్చుకొంటూ వస్తున్నా. మీరు నా అభిమానులు కాబట్టి మీకు తలో కాపీ ఇవ్వమంటారా ?

మధు : ఇంకా అడుగుతున్నారా ? ఇవ్వండి, సంతోషంగా స్వీకరిస్తాం.

ఉమ : కాపీలు నా వెంటే తెచ్చాను. ఇదిగో మూడు కాపీలు. అందరికి అందు బాటులో ఉండాలని నా అభిప్రాయం.

రాధ : అప్పుడే రచయితలకు పేరూ ప్రఖ్యాతులు వస్తాయి.

ఉమ : అందుకని పుస్తకం ఖరీదు రెండు రూపాయలు మాత్రమే పెట్టారు. మీ మూడు కాపీలకు ఆరు రూపాయలు మాత్రమే. ఇప్పుడిచ్చేస్తారా ?

సుధ : ఏమిటీ, పుస్తకాలు అమ్ముకోవడానికి వచ్చారా ? చంపేరు పొండి.

మధు : సుధా, అన్నట్టు మనం సారింటికి వెళ్లాలనుకొన్నాం కదూ

సుధ : సారీ కాంతంగారూ, మేంకొంచెం బిజీగా ఉన్నాం, కాపీలు మీ దగ్గరే ఉంచండి. మళ్ళీ కల్సుకోకపోతామా ? పదవే రాధా మనకి మళ్ళీ లేటయి పోతుంది.

ఉమ : అందుకే అంటారు, చచ్చినవారి కళ్లు చారడేసి అని. చచ్చిన కళేబరాని కుండే విలువ బతికున్న మనిషికి లేదు కదా, ఔరా ! కలికాలం కదండీ ! మరి నన్ను వెళ్లిరమ్మంటారా ?

సుధ : మంచిదండి. నమస్కారం.

# హాస్య బావ



సంకలనకర్త:
మద్దిపట్ల వెంకటరావు

చిత్రాలు:
చందు



